# యువ విజేతలు



మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా ఉదయతారగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Ground Floor, Swathi
Enclave, Amman koil street,
Vadapalani, Chennai-26
(or)
online@chandamama.com

## బ్యాడ్మింటన్ రారాజు

మహారాష్ట్రకు చెందిన అథర్వ షిండేకి ప్రస్తుతం 15 ఏళ్లు. చిన్నప్పటినుండే బ్యాడ్మింటన్ ఆడుతున్న అథర్వ థానేలోని సయ్యద్ మోడి బ్యాడ్మింటన్ అకాడెమీలో శిక్షణ పొందుతున్నాడు.

ప్రస్తుతం ఇతడు రాష్ట్ర, జిల్లా స్థాయి ఛాంపియన్‌షిప్ పోటీలకోసం శిక్షణ పొందుతున్నాడు. 2010 రాష్ట్ర టోర్నీలో అండర్ 16 విభాగంలో ఇతడు సెమీ ఫైనలిస్ట్‌గా వచ్చాడు.

పాఠశాల, నగర స్థాయిల్లో జరిగిన పలు టోర్నమెంట్లలో అథర్వ గెలుపొందాడు. పలువురు బ్యాడ్మింటన్ క్రీడాకారులను అభిమానిస్తున్నా, ఒలింపిక్ స్వర్ణ పతక విజేత మైఖేల్ ఫెల్ప్స్ అతడి ఆదర్శ క్రీడాకారుడు. అందుకే ఇతడు మైదానంలో ప్రత్యర్థులపై శరవేగంగా పైచేయి సాధిస్తుంటాడు. బ్యాడ్మింటన్ అకాడెమీలో ప్రతిరోజూ కఠిన శిక్షణ పొందుతున్నప్పుడు, తనకు ఇష్టమైన పాటలు వినటం ఎన్నటికీ మర్చిపోడు. ఇది అతడికి ప్రేరణ ఇవ్వడంతో పాటు క్లిష్టమైన మ్యాచ్‌లలో ఒత్తిడిని అధిగమించడంలో కూడా తోడ్పడుతోంది.

బ్యాడ్మింటన్ ఆడనప్పుడు లేదా చదువుకోకుండా ఉంటున్నప్పుడు తన జట్టు సభ్యులను ఆటపట్టిస్తుంటాడు. మంచి సింగిల్స్ ఆటగాడిగా కావాలని ఇతడి కోరిక. కానీ అకాడెమీలో జట్టు సభ్యులతో కలిసి ఆడుతుంటాడు కూడా. డబుల్స్‌లో కూడా ఇతడు మంచి ఆటగాడు.

బ్యాడ్మింటన్‌తో పాటు, పరుగుపందెం, ఫుట్‌బాల్, లాన్ టెన్నిస్ అంటే కూడా అథర్వకు బాగా ఇష్టం. భారత్ తరపున ఆడి పతకాలు గెలవాలన్నదే ఇతడి జీవితాశయం. ఈనెల ఉదయతారకు చందమామ శుభాకాంక్షలు.

డిసెంబర్ 2011 ₹20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**



**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by
CHANDAMAMA INDIA LTD.,
Published and Printed on their behalf by
Prashant Sharad Muleker
Published at B-3, Cross Road 'B', MIDC,
Andheri (East) Mumbai - 400093.
Printed At :- Kala Jyothi Process Pvt. Ltd,
S.No.185, Kondapur, R.R.District-500133,
Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar

T

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-2 December 2011 Issue-12

ప్రియపాఠకులారా!!!

ప్రతి సంవత్సరం డిసెంబర్ నెలలో మేం చేస్తూ వస్తున్న సర్వ సాధారణ ప్రకటనల్లో ఇది ఒకటి. 'ఓహ్, కాలం ఎంత త్వరగా పరుగెడుతోందో చూడండి!!! మనం మరో సంవత్సరం ముగింపులో ఉన్నాము..' రోజులు గడిచే కొద్దీ, ఈ సంవత్సరం మరింత వేగంగా సాగిపో యిందని భావిస్తుంటాము. సంవత్సరం ప్రారంభంలో అనేక అంశాలపై పథకాలు రచించి, తీర్మానాలు చేసుకుంటాం. కాని వాటిని అమలు చేయడానికి మనం పూనుకునే సమ యానికి డిసెంబర్ నెలలోకి వచ్చేసి ఉంటాము.

మనతో, మన దేశంతో, మన భూమితో 2011 ఎలా వ్యవహరించిందో తడిమి చూసు కున్నప్పుడు కొన్ని ఆసక్తికర విషయాలను గమనిస్తాము. మనం ఎత్తు పల్లాలను అనుభవించి ఉంటాము. ఈ 2011 సంవత్సరం మా పాఠకులకు ఏమిచ్చింది? ఈ సంవత్సరం వారి ఇష్టాయిష్టాలు ఏమిటి? వారు ఏమి సాధించారు? వంటి అంశాలపై ఉత్తరాలు, మెయిల్స్‌ని పంపవలసిందిగా పాఠకులను కోరుతున్నాము.

మనం రాజకీయంగా, ఆర్థికంగా ఈ ఏడు చాలా ఒడిదొడుకులను ఎదుర్కొన్నాము. దీంతో మనం ముందుకు పోతున్నామా లేదా వెనక్కెళుతున్నామా అని ఆశ్చర్యం వేస్తోంది.

చందమామ మాత్రం తను చేసిన హామీలు, తీర్మానాలు, పథకాలను చాలావరకు అమ లులోకి తీసుకువచ్చింది. అతి కొద్ది మినహాయింపులతో, మా పాఠకులు సంచికను సకా లంలో అందుకోగలిగేలా మా పనిని చక్కదిద్దుకున్నాం. గ్రామీణ భారతదేశంలోకి విస్తరించ గలిగాము. ఈ ఏడు ఐఫోన్, ఐప్యాడ్‌లలో మన పత్రికను ప్రారంభించినప్పుడు చాలా ప్రోత్సా హకరమైన స్పందన వచ్చింది. ఈ రంగంలో పూర్తిస్థాయిలో ప్రవేశించేందుకు ప్రయత్ని స్తున్నాము. మొబైల్ ఫోన్లలో, ఇంటర్నెట్‌లో మొబిసోడ్స్, ఆడియో కథలను ప్రారంభిం చాము. ఈ నెలలోనే 3డి బుక్ కూడా ప్రారంభిస్తున్నాము. పాఠకులు, అభిమానుల ఆశీస్సులతో మేం 2012లో మరింతగా ముందడుగు వేస్తామని ఆశిస్తున్నాము.

జీసస్ క్రీస్తు జన్మదినమైన డిసెంబర్ 25న మనం క్రిస్మస్ పర్వదినం జరుపుకుం టున్నాము. నూతన సంవత్సరంలోకి అడుగుపెడుతున్నందున, ఈ సంవత్సరం సాధించిన దానికంటే మరిన్ని ఫలితాలను సాధించాలని ప్రతిన చేద్దాము.

– సంపాదకులు



# పాఠకుల లేఖలు

అక్టోబర్ నెల చందమామలో మధుర జ్ఞాపకాలు చదువుతుంటే పున్నమి చంద్రుడిలా మన దేశంలోనే కాకుండా ఖండాంతర ఖ్యాతి చెందుతున్నట్లు చందమామ రుజువు చేసుకుంది. ప్రతి పుటలోని కథలలో ఏదో కొత్తదనం అలాగే క్విజ్‌లో పిల్లలకు మెదడుకు మేతలాగా, భారత దర్శినిలో కొత్త విషయాలను అందజేస్తున్న ఆప్తుడిని ఎలా మరువగలం? మా ఇంట్లో చందమామ వచ్చిందంటే నా మనుమలు, మనవరాళ్లు కథలు చెబుతుంటేనే భోజనం చేస్తారు. కథలు వింటూనే నిద్రపోతారు. అంటే కథలన్నీ అంత రుచిగా మైమరిపించేవిగా ఉంటాయి.

– పులిజాల రవీందర్‌రావు, హైదరాబాద్

అక్టోబర్ సంచికలో బేతాళ కథ పాత చందమామను గుర్తు చేసింది. అందరికీ కీడు చేసిన పచ్చలహారం రాజు స్నేహితుడికి ఎలా మేలు చేసిందో చెప్పడంలో రచయిత కథ ముగింపులో చూపిన తర్కం చాలా బాగుంది. బేతాళ కథకు శంకర్ గారు వేసిన చిత్రాలు అద్భుతం. రాజూ, రాణీ చిత్రాలను ఆయన ఎంత సుందరంగా వేశారో! నేటికీ ఆయన చిత్రాల్లో వాడి తగ్గలేదు.

– జోగినాయుడు, విశాఖపట్నం

అక్టోబర్ సంపాదకీయం పుటలో ఒక వాక్యం నన్ను ఆకర్షించింది. 'నిరాడంబరుడైన ఓ వృద్ధ యువకుడు చరిత్రను సృష్టించాడు' అంటూ మీరు పొందుపర్చిన వాక్యం అన్నా హజారే పేరు ప్రస్తావించకుండానే ఆయన వ్యక్తిత్వాన్ని ఎత్తిపట్టింది.

– అరుణ, గిద్దలూరు, ప్రకాశం జిల్లా

సెప్టెంబర్ సంచికలో వచ్చిన 'ఆల్కహాలిక్ పిల్లలు,' 'బుజ్జి' రచనల పరిచయం ఆసక్తికరంగా ఉంది. కుటుంబాలలో ఆల్కహాలిక్ పిల్లల దయనీయ పరిస్థితులను వివరించే రెండు విలువైన పుస్తకాలివి. వీటిని ఉచితంగా అందించడం మరీ బాగుంది. ప్రాజెక్ట్ నిషేద్ సంస్థ సేవా దృక్పథానికి అభినందనలు.

– పి. శంకర్ రావు, హైదరాబాద్

ఈమధ్య చందమామలో చాలా పాత కథలు వేస్తున్నారు. సంతోషం. కాని 1952కి ముందు చందమామ సంచికలో ఉన్న కథలకు 53 నుండి ప్రచురించిన కథలకు చాలా తేడా ఉంది. కుటుంబరావుగారికి ముందు చందమామ కథలు సాదా సీదాగా వచ్చినవి వచ్చినట్లుగా అచ్చయిపోయేవి. కొ.కు. వచ్చాకే చందమామ కథల శైలి, విషయం మారింది. గాంధీగారి శైలి అనబడే సాదా రచనా శైలితో కొ.కు. చందమామ కథలకు జీవం పోశారు. 53 నుంచి చందమామలో వచ్చిన కథలనే మళ్లీ ప్రచురించండి. 52కి ముందు కథలు అంతగా ఆసక్తి గొల్పవు.

– జి. త్రివిక్రమ్, బెంగళూరు

చందమామద్వారా మీరు అందిస్తున్న కథలు మా నైతిక విలువలను పెంచడంలో తోడ్పడుతున్నాయి. చందమామలో అక్బర్–బీర్బల్ కథలను మళ్లీ ప్రచురించగలరు.

– సాగర, శ్రీ సరస్వతీ విద్యా మందిర్ స్కూల్, గుల్బర్గా, కర్నాటక

‘మతాబుల మతలబు,’ ‘దొడ్డమనిషి,’ ‘సుఖినోభవంతు’ కథలు చందమామ శైలికి సంబంధించినవి కావు. ఇలాంటి కథలు సాధారణంగా చందమామలా కనిపించే ఇతర సంచికలలో ప్రచురించబడుతుంటాయి. – డి. అన్వేషి, ముక్త్యాల, ఎ.పి.

అరుదైన, పాత ముఖచిత్రాలను తీసుకురావడం ద్వారా మీరు చందమామ చరిత్రను తడుముతున్నారు. ఆశ్చర్యకరంగా ఈ నెల క్విజ్ ప్రశ్నలు చాలా సులభంగా ఉన్నాయి. ఈ నెలలో వచ్చిన 3 పొట్టి కథలూ అద్భుతంగా ఉన్నాయి. ప్రతి నెలా మూడు లేదా ఐదు పొట్టి కథలు వేయండి. – జి. స్వప్న. భీమవరం

చందమామ సంచిక చాలా ఆసక్తిగొల్పుతోంది. ‘పసిపాప నేర్పిన పాఠం,’ ‘మాట తప్పని మహారాజు,’ ‘కావేరీ పుట్టుక’ వంటి కథలు చాలా బాగున్నాయి.

– ఎం.పి. స్వామి, చామరాజ్‌పేట్, బెంగళూరు

వినాయకుడి ముఖచిత్రంతో వచ్చిన చందమామ ఆకర్షణీయంగా ఉంది. పంచతంత్ర, బీర్బల్, జీవిత పాఠాలు వంటి కథలు చక్కగా చదివించాయి. చందమామను గత 40 ఏళ్లుగా చదువుతున్నాను. అభినందనలు. – ఆర్. విజయకళ, ఆదర్శనగర్, బెంగళూరు

ఎంటీవీ ఆచార్య గారు వేసిన దీపావళి ముఖ చిత్రం నిరాడంబరంగాను, పరమవాస్తవికంగాను ఉంది. ‘గుణమణి’ కథ దేశభక్తిని చాటి చెబుతోంది. చందమామ పాత రోజులకు మళ్లీ విరాజిల్లుతున్నందుకు సంతోషంగా ఉంది. దయచేసి ఫోటో వ్యాఖ్యల పోటీని తిరిగి ప్రారంభించండి. – విజయలక్ష్మీ వెంకటేశన్, చెన్నయ్

చందమామను  నా బాల్యం నుండి చదువుతున్నాను. ఇప్పటికీ చందమామను చదివే అలవాటు పోలేదు. జీవిత పర్యంతమూ ఈ పుస్తకాన్ని చదువుతూనే ఉండాలనుకుంటున్నాను. చందమామను చదివినప్పుడల్లా, మన దేశానికి, దాని వైభవోజ్వల చరిత్రకు చాలా సన్నిహితంగా ఉన్నట్లు అనిపిస్తుంటుంది. రామాయణ మహాభారత గ్రంథాలను చందమామ వర్ణించిన తీరు సుందరభరితంగా ఉంటుంది. జానపద కథలను మర్చిపోలేము. – రోహిత్

నేను పదవీ విరమణ చేసిన ప్రభుత్వ డాక్టర్ని. 1960 నుంచి చందమామ చదువుతున్నాను. ఈ రోజుకీ చందమామను నేను వదలడం లేదు. నా పిల్లలూ చదువుతున్నారు. నా మనవడు కూడా మెల్లగా కూడబలుక్కుని చందమామ చదువుతున్నాడు. చందమామ పట్ల ఇంత ఆకర్షణకు కారణం దీంట్లోని కథలు ఇంగ్లీషు వాళ్ల హారీపోటర్ నవలల్లో లాగా మంత్రాలు, మంత్రగాళ్లు, గాలిలో ఎగిరిపోవటాలు లాగా కాకుండా, ఆ కాలపు ప్రజల్లో ఉన్న మంచితనం, చక్కని కొండలు, నదులు, అడవులు, పచ్చని చెట్లు, ప్రజల్లో అమాయకత్వం, స్వచ్ఛత వంటి గుణాలతో కూడి ఉండటమే. ఇవి.. విచిత్ర వ్యక్తి, టామ్ సాయర్, హకల్ బెరిపిన్ వంటి మార్క్ ట్వైన్ నవలలను గుర్తుకు తెస్తాయి. ఈ పాత రీతినే కొనసాగించండి. పొరపాటున మీరు విమానాలు, కార్లు, జేమ్సుబాండ్ వంటివి పెట్టారంటే నాలాంటి వాళ్లు చందమామను చదవటం మానేస్తారు. – డా.వి.వి. నరసింహారావు, బుట్టాయి పేట, మచిలీపట్నం

**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)**

# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**

**Go to www.chandamamashop.com & subscribe Now!!**



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..............................................................................................

Date of Birth: ................................. Sex :.......................................

Address: ..........................................................................................

...........................................................................................................

...........................................................................................................

.............................................................. City: ..................................

State:.......................................... Pin:..................................................

Telephone:........................................................................................

Mobile:..............................................................................................

Email:................................................................................................

Subscription Number (for renewals):................................................

Gift Subscription to the following address:

...........................................................................................................

...........................................................................................................

...........................................................................................................

...........................................................................................................

Enclosed Cheque/DD* for Rupees.....................................................

Cheque/DD No ..................................................................................

favouring Chandamama India Ltd on.................................................

.................................................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| **You Save** | | **Rs. 60** | **Rs. 135** | **Rs. 240** | **Rs. 375** |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| **You Save** | | **Rs. 50** | **Rs. 110** | **Rs. 190** | **Rs. 300** |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| **You Save** | | **Rs. 35** | **Rs. 80** | **Rs. 145** | **Rs. 225** |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# చందమామతో నా జ్ఞాపకాలు - 1

నాకు ఆరేళ్ళు కూడా నిండని వయస్సులో ఒకరోజు మా తాతగారు 'మంచి కథల పుస్తకం ఇదిగో' అంటూ అందమైన అట్ట లోపల రంగుల బొమ్మలున్న చందమామని తెచ్చి యివ్వడం బాగా జ్ఞాపకం వుంది. నాకప్పుడది చందమామ తొలి సంచికని తెలియదు.

అక్షరాలూ-గుణింతాలూ నేర్చుకుని అప్పుడప్పుడే చిన్న చిన్న వాక్యాలు మాత్రమే చదవగలుగుతున్న నాకు మా మేనత్త అందులో కథలు చదివి వినిపించింది. పదే పదే చదివి వినిపించుకునేవాణ్ణి. ప్రతినెలా చందమామ యింటికి రావటం మొదలయింది. నా అంతట నాకు చదవటమూ వచ్చేసింది. అప్పట్నించి చదువుతూనే వున్నాను. ఎప్పుడైనా చందమామైనా ఆగిందేమో కాని నేను మాత్రం ఆగలేదు.


Name: J. Narayana Murthy
Occupation: C.G.M
IDBI Bank.Rtd, Hyderabad.

తొలి సంచికల్లో వచ్చిన కథలు ఇప్పటికీ చాలామటుకు జ్ఞాపకం వున్నాయి. ముఖ్యంగా పొట్టి పిచుక కథ (అవసరాల రామకృష్ణారావు), దెయ్యం అరుపు (భానుమతీ రామకృష్ణ) లాంటి కథలు అలాగే గుర్తుండిపోయాయి. ఆ తర్వాత మా పిల్లలిద్దరూ వాళ్ళ చిన్నప్పుడు చందమామ కథల్ని నాచేత చదివి చెప్పించుకుంటుంటే గడిచిన బాల్యం ఒక్కసారి తిరిగివచ్చేది.

1982-88 ప్రాంతంలో నేను ఉద్యోగ రీత్యా చెన్నయ్‌లో వున్నప్పుడు, చందమామకి వెనకనుండి వెలుగులిచ్చే శ్రీ దాసరి సుబ్రహ్మణ్యం గారితో పరిచయమయింది. ఒకసారి నేను వారిని చందమామ కార్యాలయంలో కలిసినపుడు వారు నాకు ఆరంభంలో వచ్చిన చందమామలున్న సంపుటాన్నొకటి బహూకరించారు. ఇప్పటికీ దానిని నేను అపురూపంగా దాచుకుంటున్నాను.

మరో విషయం ఏమిటంటే, చందమామ నన్ను కేవలం పాఠకుడిగానే మిగిలిపోనీయకుండా రచయితని కూడా చేసింది. జొన్నలగడ్డ రత్న, కమలిని పేరుతో నేను రాసిన 80 దాకా కథల్ని ఇప్పటిదాకా ప్రచురించింది. ఇంతకన్నా గర్వించదగినది నాకేముంటుంది.

నలభై సంవత్సరాలకి పైగా చందమామకి అవిరామంగా అసంఖ్యాకమైన కథలు అందిస్తున్న 'వసుంధర' (డా. జొన్నలగడ్డ రాజగోపాలరావు... నా సోదరుడు), మరో ఇద్దరు సోదరులు డాక్టర్ మార్కండేయులు, రాంబాబులు కూడా తరచు చందమామకి రాస్తుంటారు. అందుకే దాసరి సుబ్రహ్మణ్యంగారు ఆప్యాయంగా 'మాది చందమామ

కుటుంబం' అనేవారు. చందమామతో వున్న అనుబంధాన్ని చెప్పుకోటానికి ఇంకేముంటుంది. జానపద నేపథ్యం, సుతిమెత్తని హాస్యం, సునిశితమైన వ్యంగ్యం చక్కని నీతి వుండే కథల్ని చిన్నపిల్లల మనోఫలకంపై ముద్రించటమే కాకుండా, పెద్దల్ని కూడా చందమామ ఎప్పుడూ ఆలోచింపజేసింది. అందుకే చందమామ అందరి పత్రిక.

ఈ మధ్య దాసరి సుబ్రహ్మణ్యంగారి వర్ధంతి సభలో వక్తలన్నట్లు చందమామ మన జాతీయ ఆస్థి. దాన్ని అందరూ కాపాడుకోవాలి.

## చందమామతో నా జ్ఞాపకాలు – 2

మా కుటుంబంలో ఒకసభ్యుడిగా, నేను కూడా మా ముగ్గురు పెద్దక్కలతో పాటు చందమామ కథలు చదువుతూ పెరుగుతూ వచ్చాను.

మేం పుట్టకముందే చందమామ పత్రిక మా ఇంట్లో అడుగుపెట్టిందట. మా తల్లితండ్రులూ, అక్కలూ చందమామ కాపీలను సంవత్సరం వారీగా భద్రపెడుతూ వచ్చేవారు. ఇవి ఇప్పటికీ మా అమూల్య సంపదలాగా మిగిలి ఉన్నాయి. మా పెద్దక్క సీమా దీదీకి చందమామ అంటే ప్రాణం. మేము బడిలో చదువుతున్నప్పుడు, సెలవు రోజుల్లో ఆమె పాత చందమామలు తీసుకుని మళ్లీ చదివేది.



Name: Sandeep H. Dave
Occupation: Junior Forensic Clerk, Junagadh.

చందమామ కథలు, బొమ్మలు అన్నీ మాకు తెగ నచ్చేవి. బాల్యంలో మేం అనేక పిల్లలపత్రికలను చదివే వాళ్లం. చందమామతో పరిచయం అయ్యాక దాని అర్థవంతమైన కథలు మాకు మరపురాని అనుభవాన్ని ప్రసాదించేవి. సంపూర్ణనైతిక విలువలు, సామాజిక న్యాయం, నీతి కలబోతే కదా చందమామ కథంటే.

ఈనాటికీ, సెలవులు రాగానే, మా మనవళ్లు అభి, దర్శిత్, మనమరాలు కృతిక మా ఊరు జునాగడ్ వచ్చారంటే చాలు.. మా ఇంట్లో ఉన్న పాత చందమామ ప్రతులు తీసి చదువుతారు. మేం అక్కా తమ్ముళ్లం మా బాల్యంలోని అద్భుత క్షణాలను వారితో పంచుకుంటుంటాము. ఆ మధుర జ్ఞాపకాలు మామనస్సులను స్వచ్ఛతతో, తాజాదనంతో నింపుతుంటాయి.

Request to readers: Contributors of stories, memories are requested to send in their entries with their complete name, address, phone no and other contact details to enable us to get back to you.
Write to us:
**Chandamama India Ltd.,** No:2 Ground Floor,
Swathi Enclave, Amman koil street, Vadapalani, Chennai-600026.
● Phone: 044-43992828 ● Email : online@chandamama.com





# అమృతవర్షిణి నిర్ణయం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి ఎప్పట్లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా, అపాయం ఉన్నప్పుడు, రక్షించిన వారిపట్ల కృతజ్ఞత ఎవరికైనా విద్యుక్తధర్మమే. కాని అమృత వర్షిణి అనే అవంతీ రాకుమారి తనని కాపాడిన వ్యక్తిపట్ల కృతజ్ఞత చూపక అహం భావంతో స్వార్థప్రయోజనానికే ప్రాధాన్యత నిచ్చింది. శ్రమ తెలియకుండా ఉండేం దుకు నీకా కథ చెబుతాను విను', అంటూ ఇలా చెప్పసాగాడు.

అవంతీ రాజ్యంలో జింకలమిట్ట అనే గ్రామంలో ఉండే ప్రదీపుడనే యువకుడు ధైర్యసాహసాలు కలవాడు. గుర్రపు స్వారిలోనూ, యుద్ధవిద్యలలోనూ ఆరి తేరిన వాడు. అవంతీసైన్యంలో ఉపదళపతిగా ఉండి వైభవంగా జీవించిన తన ముత్తాత



లాగా తను కూడా సైన్యంలో చేరి ఎదగాలని ప్రదీపుడు ఉబలాటపడేవాడు.

ఇలా ఉండగా అవంతీరాజు విక్రమ సింహుడి కుమార్తె అమృత వర్షిణి రాత్రి సమయంలో తన శయన మందిరంలో పవళించి ఉండిన పాన్పుతో సహా అదృశ్యమైంది. రాజు దీనిపై విచారించగా ఎవడో మాంత్రికుడు ఆమెని దక్షిణ సముద్రంలో మకరద్వీపంలో ఉంచినట్లు తెలిసింది.

తన కుమార్తెను తీసుకురాగలిగిన వాడికి కోరిన బహుమతి ఇస్తామని రాజు చాటింపు వేయించాడు. అంతదూరం వెళ్ళి మాంత్రికుడితో తలపడ్డానికి రాజ్యంలో ఎవరూ ముందుకు రాలేదు.

రాజుగారి ప్రాపకం సంపాదించాలని ప్రదీపుడు, ఆ సాహసం చేయడానికి సిద్ధపడ్డాడు. తల్లిదండ్రుల దీవెనలు తీసుకుని సాయుధుడై మేలు జాతి గుర్రం ఎక్కి, దక్షిణ సముద్రం వైపు బయలు దేరాడు. అడవిలో దాడికి ప్రయత్నించిన క్రూర మృగాలని, అనాగరికులను వీరోచిత పోరాటంలో సంహరించి దక్షిణ సముద్రం చేరుకున్నాడు. సముద్రంలో ఎన్నో ఒడిదుడుకుల నధిగమించి, స్వంతంగా తయారు చేసుకున్న పడవ ద్వారా మకరద్వీపాన్ని చేరుకున్నాడు.

ఆ ద్వీపంలో ఓ జలపాతం వద్ద దప్పిక తీర్చుకుంటూ ఉండగా పక్షుల కోలాహలం వినిపించింది. అతడు అటువైపు వెళ్ళగా అందమైన ఉద్యానవనం కనిపించింది. 'జనసంచారం లేని చోట అందమైన ఉద్యానవనం ఉందంటే ఇందులో ఏదో విశేషం ఉండే ఉంటుంది. మాంత్రికుడు రాకుమారిని ఉంచిన ప్రదేశం ఇదేనేమో?' అనుకుంటూ ప్రదీపుడు తోటలోకి ప్రవేశించాడు.

రంగురంగుల పూలతో నిండిన వివిధ రకాల పూపొదలు, నోరూరించే మధుర ఫలాలతో నిండినఫలవృక్షాలు, వినువిందు చేసే కోయిల పాటలు, సాధు జంతువుల దాగుడు మూతలాటలు, ఆ వనం ఎంతో ఆహ్లాదకరంగా ఉంది. తోటలో ఆనందంగా విహరిస్తుండగా, అందమైన మేడ, మేడ మీద అపురూప లావణ్యరాశి కనిపించింది.

ప్రదీపుణ్ణి చూడగానే ఆమె పరుగున అతడి చెంతకు వచ్చి ఆతురతతో ఏదో మాట్లాడబోయి టక్కున ఆగిపోయింది.

'అమృత వర్షిణి మీరే కదూ?' అడిగాడు ప్రదీపుడు. ఆమె జవాబు ఇవ్వలేదు.

'ఇంక మీరు భయపడవలసిన పని లేదు. మిమ్మల్ని రక్షించి తీసుకెళ్ళగలిగే శక్తి సామర్థ్యాలు నాకు ఉన్నాయి. నా వెంట రండి,' అన్నాడు ప్రదీపుడు.

ఆమె అతడి వెంట కదలలేదు.

'అయితే మీరు అమృత వర్షిణి కాదు. ఆమె మరోచోట ఉందేమో. ఆమె కోసం నేను త్వరగా వెళ్లక తప్పదు,' అంటూ తిరిగి వెళ్ళిపోతుండగా ఆమె ఆందోళనతో 'ఆగండి, నేనే అమృత వర్షిణిని' అంది.

ఆమె నోటి నుంచి మాట వెలువడిన మరుక్షణం ప్రదీపుడు నెమలిగా మారిపోయాడు. ప్రదీపుడు తన రూపాన్ని చూసుకుని మహా ఆశ్చర్యపోయాడు. తన శౌర్య పరాక్రమమంతా ఒక్కసారిగా నిర్వీర్యమైపోయినట్లు అనిపించిందతనికి.

అమృత వర్షిణి, నెమలి చెంతకు వచ్చి, 'నన్ను క్షమించండి. నన్నెవరూ రక్షించడానికి వీలులేకుండా ఆ దుర్మార్గుడు నా మాటను మంత్రబద్ధం చేశాడు. మీరిలా కాకుండా ఉండటానికే నేను మౌనం వహించాను. దురదృష్టం వదలలేదు. నన్నెవరు ఎందుకు బంధించారో? సవివరంగా జరిగింది మీకు వివరిస్తాను,' అంటూ తన పూర్వకథ ఇలా చెప్పసాగింది.

ప్రహర్షుడనేవాడు రాజోద్యానవనంలో పనిచేసే తోటమాలి కుమారుడు. వాడు రాకుమారి అందం గురించి కర్ణాకర్ణిగా విని ఆమెను ఎలాగైనా చూడాలని ఆశపడ్డాడు. వాడు తండ్రితోపాటు తోటకెళ్లి శ్రద్ధగా





పనిచేస్తున్నట్లు నటించేవాడు. ఒకరోజు తోటనుంచి నిష్క్రమిస్తున్న భ్రమ కలిగించి తండ్రి కళ్లు గప్పి పూల పొద చాటున నక్కి ఉన్నాడు.

చెలికత్తెలతో కలిసి విహారానికి వచ్చిన యువరాణిని చూసి ఆమె అందానికి ముగ్ధుడయ్యాడు. ఆరోజు నుండీ ప్రతి రోజూ ఆమె అందాన్ని ఆస్వాదిస్తూ ఆనందించేవాడు. ఒకరోజు కళ్లకు గంతలు కట్టుకొని దాగుడుమూతలాడుతున్న యువరాణి తన చెలికత్తె అనుకుని ప్రహర్షణుణ్ణి పట్టుకుంది. ఆమె గంతలు విప్పి వాడిని చూసి ఆశ్చర్యపోయింది.

'ఓ యువరాణీ, నీ అందం నన్ను పిచ్చివాడిని చేస్తోంది. రోజురోజుకీ నీ పట్ల ప్రేమ భావం పెరుగుతోంది. నీవు కూడా నన్ను వలచి ధన్యుడిని చేయి. జన్మాంతంవరకు నీకు బద్ధుడినై ఉంటాను,' అంటూ ఆమె చేయి అందుకున్నాడు.

యువరాణి ఆగ్రహావేశంతో మండిపోతూ వాడి చేయి విసిరి కొట్టి, చెంప చెళ్లుమనిపించి చెలికత్తెలతో కలిసి వెళ్ళిపోయింది.

మహారాజు చెలికత్తెల ద్వారా జరిగిన ఘటన గురించి తెలుసుకుని ప్రహర్షణుణ్ణి పట్టి బంధించి అతడిని వధించి పక్షులకు, జంతువులకు ఆహారంగా వదిలిరమ్మని ఆదేశించాడు. రాజభటులు తీవ్రంగా గాలించి, ప్రహర్షణుణ్ణి పట్టుకుని అడవికి తీసుకెళ్ళి తల నరికి చంపేశారు.

ఈ సంఘటన రాజుకు తన కుమార్తెకు పెళ్ళి చేయాలన్న సంగతి గుర్తు చేసినట్లయింది. రాజు విదేశాల్లోని ఎందరో రాజకుమారుల రూపురేఖలను, గుణగుణాలను నిశితంగా పరిశీలించి చివరికి కోసల రాజు కుమారుడు ఆనందవర్ధనుడు తగిన వరుడిగా అనుకున్నాడు.

ఇది ఇలా ఉండగా కుశధర్ముడనే మహామంత్రవేత్త అడవి మార్గం గుండా హిమాలయాలకు వెళుతూ తల మొండెం వేరు వేరుగా పడి ఉన్న ప్రహర్షణుణ్ణి చూశాడు.

తన మంత్ర శక్తి మహిమతో జరిగింది తెలుసుకొని, ప్రేమించిన పాపానికి తల నరికి చంపడం చాలా అన్యాయంగా భావించి ప్రహర్షణుడు వాడిని బ్రతికించాడు. అవంతీరాజు వలన వాడికింకా

ప్రాణగండం ఉందని ఆత్మరక్షణ కోసం వాడికి మంత్రశక్తులను ఉపదేశించాడు.

'నాయనా, నీవు నేర్చిన విద్య మంచి కార్యాలకి వినియోగిస్తే మహాత్ముడివౌతావు. నీ ఆలోచన పెడదారి పడితే పతనమే నీ గమ్యమవుతుంది. ప్రేమించిన యువతి హృదయాన్ని గెలవడానికి ఉత్తమగుణమే తగినమార్గం' అంటూ కుశధర్ముడు హితవు చెప్పి వెళ్లిపోయాడు.

మంత్రశక్తులు వశం కావడంతో ప్రహర్షణుడు మహా గర్విష్టిగా మారిపోయాడు. అదే సమయంలో మంత్రవేత్త చెప్పింది కూడా కొంత పాటించాలనుకున్నాడు. ఎలాగైనా అమృత వర్షిణినే వివాహం చేసుకోవాలనుకున్నాడు. నిర్జన ప్రదేశమైన మకర ద్వీపంలో అందమైన ఉద్యానవనాన్ని నిర్మించాడు. అమృత వర్షిణిని అందరూ నిద్రిస్తున్న వేళ అక్కడికి తీసుకువచ్చాడు. ఆమెకు సకల సౌకర్యాలు కల్పించాడు.

అయితే ప్రహర్షణుడు ఎంత ప్రాధేయపడినా అతడితో వివాహానికి ఆమె అంగీకరించలేదు. వాడు విసుగెత్తిపోయాడు. ఇక మంచితనం పనికిరాదని దౌర్జన్యమే తగినదనే నిర్ణయానికి వచ్చాడు. కుశధర్ముడి హితవు వదిలేశాడు. ఒక్కనెల రోజుల తర్వాత తిరిగి వస్తానని ఈలోగా మనసు తన మైపు మళ్లించకపోతే బలవంతంగా వివాహం చేసుకుంటానని హెచ్చరించి ఒంటరితనం శిక్షగా విధించి వెళ్లాడు. ఉద్యానవనం దాటి వెళ్లడానికి ప్రయత్నిస్తే ఆమె భస్మీపటలం



అవుతుంది. ఎవరితోనైనా మాట్లాడటానికి ప్రయత్నిస్తే వారు పక్షులుగా మారిపోయేటట్టుకూడా ఆమె మాటను మంత్రబద్ధం చేశాడు.

ప్రదీపుడికి ఇలా జరిగింది తెలిసింది. తను పక్షిగా మారి శక్తిని కోల్పోయినందుకు అతడు అధైర్యపడలేదు.

అమృత వర్షిణి ఎల్లప్పుడూ నెమలినే అంటిపెట్టుకొని ఉండేది. ఆమె తన తల్లిదండ్రుల గురించి, స్నేహితురాళ్ళ గురించీ, అంతఃపురంలోని సంగతులు నెమలికి చెప్పేది. సరదా సంగతులు చెప్పి పకపక నవ్వుతూ ఆనందించేది.

నెమలి తన నాట్యంతో ఆమెని అలరించేది. ఇలా వారిద్దరూ మంచి స్నేహితులయ్యారు.

ప్రహర్షణుడు తిరిగి వచ్చేసమయం ఆసన్నమౌతుండగా ఆమె భయం చూసి 'భయపడవలదు. వాడిని నేను సంహరి స్తాను' అంటూ నెమలి ఆమెకు ధైర్యం చెప్పసాగింది.

నెల తర్వాత ప్రహర్షణుడు రానేవచ్చాడు. వనంలోని పక్షుల్ని జంతువులను తన ఎదుటకు రప్పించాడు. పక్షులను, జంతు వులను మంత్రాలు చదవడానికి బ్రాహ్మ ణులుగాను, పెళ్లికుమార్తెను అలంకరిం చడానికి ముత్తయిదువులుగాను, సందడి చేయడానికి బంధువులుగాను మార్చాడు.

తర్వాత నెమలి రూపంలో ఉన్న ప్రదీ పుణ్ణి చూసి, అసలు సంగతి తెలుసుకొ న్నాడు. తన వన్నెచిన్నెలతో అమృతవర్షిణి ఒంటరితనాన్ని పోగొట్టినందుకు కోపంతో ఎలుకల్ని, పాముల్ని తింటూ అసహ్యకర మైన జీవితం గడపమంటూ ప్రదీపుణ్ణి గద్దగా మార్చేశాడు.

పున్నమి వెన్నెలలో పెళ్ళి ఏర్పాట్లు ప్రారంభమయ్యాయి. ముత్తయిదువులు అమృత వర్షిణిని అలంకరించి తీసుకు వచ్చారు. ప్రాంగణం సందడిగా ఉంది.

తాళికట్టేసమయం ఆసన్నం కావడానికి ఇక ఎంతో సమయం లేదు. గద్దరూపంలో ఉన్న ప్రదీపుడు, తీవ్రంగా ఆలోచిస్తూ ఆకాశంలో చక్కర్లు కొడుతున్నాడు. తోటలో ఓ మూలగా ఉన్న పుట్టలోని ఓ విషసర్పం బయటకు వచ్చింది. దాన్ని చూడగానే ప్రదీపుడికి మెరుపులాంటి ఆలోచన



వచ్చింది. గద్ద విషసర్పాన్ని కాళ్లతో తన్ను కొని వచ్చి ప్రహర్షణుడి మెడలో వేసింది. విషసర్పం అతడిమెడను బంధించి బలంగా కాటువేయడంతో ప్రహర్షణుడు క్షణాలలో నురగలు క్రక్కుకుంటూ మరణించాడు.

ప్రహర్షణుడి మరణంతో మంత్రప్రభావం తొలిగిపోయి అచ్చట సాధారణ పరిస్థితులు ఏర్పడ్డాయి. అమృత వర్షిణి, ప్రదీపుడు అవంతీ రాజ్యానికి చేరుకున్నారు. విక్రమ సింహుడు ప్రదీపుడి ధైర్యసాహసాలు మెచ్చుకున్నారు.

తరువాత రాజు తన కుమార్తెతో, 'తల్లీ, కొంత కాలం సన్నిహితంగా, స్నేహంగా మెలిగినందువల్ల నీవు ప్రదీపుణ్ణి ప్రేమి స్తున్నావేమో నాకు తెలియదు. నీవుకోరితే అతడితో నీ వివాహం జరిపిస్తాను,' అన్నాడు.

'రాకుమారినైన నాకు ఒక సామాన్యు డయిన ప్రదీపుడు సమ ఉజ్జీ కాదు. నేను అతడిని ప్రేమించలేదు. కోసల రాజకుమారుడు ఆనంద వర్ధనుడితోనే నా వివాహం జరిపించండి. ప్రదీపుడికి సైన్యంలో మంచి పదవి ఇవ్వండి,' అన్నది అమృత వర్షిణి. రాజు మెచ్చుకుని ఆ విధంగానే చేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, 'రాజా, అమృత వర్షిణి నిర్ణయం అహంకారపూరితమైనదిగా నాకనిపిస్తోంది. ఆమె తనను కాపాడిన వారి పట్ల కృతజ్ఞతలేని దానిగా చరిత్రలో నిలిచి పోతుందనటంలో ఎటువంటి సందేహం లేదు. తనకు బాగా పరిచయం ఉండి గుణగుణాలు తెలిసిన ప్రదీపుణ్ణి విస్మరించి ఏ మాత్రం పరిచయం లేని ఆనంద వర్ధనుణ్ణి వివాహం చేసుకోవడంలో అర్థమేమిటి? ఏ కోశానా సహాయం అనేది లభ్యం కాని నిర్జనద్వీపంలో ఉన్న యువరాణి, తననే వెదుకుతూ వచ్చి అష్టకష్టాల పాలై చివరకు తన ప్రయత్నం ద్వారానే ఆమెను మాంత్రికుడి బారినుండి తప్పించిన ప్రహర్షణుడిని అంత తేలిక భావంతో చూడడానికి కారణమేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసీ చెప్పకపోయావో నీతల వేయి ముక్కలవుతుంది,' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, 'కయ్యానికయినా వియ్యానికయినా సమ ఉజ్జీలు అయితేనే రాణిస్తుంది. యుక్తవయస్సులోని ప్రేమ తాత్కాలిక ఆకర్షణే. కాలం గడిచే కొద్దీ ఆకర్షణతో పాటు ప్రేమ కూడా అంతరించి పోతుంది. అందువల్లే ఆమెకు ప్రేమపై నమ్మకం కలగలేదు. పెద్దలు పిల్లల భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుని తగిన భాగస్వామిని నిర్ణయిస్తారని తెలివిగా ఆలోచించి తన భవిష్యత్తుకు బంగారు బాటలు వేసుకుంది,' అని అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలుగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగీ చెట్టెక్కాడు. – కల్పితం

(ఆధారం: గుండ్రాతి సుబ్రహ్మణ్యం గౌడ్)





# ఆస్తిపంపకం

ఉజ్జయినికి దగ్గిరగల ఒక గ్రామంలో ఒక రెడ్డి ఉండేవాడు. ఆ రెడ్డి చుట్టుపక్కల గల తొమ్మిది గ్రామాలకు న్యాయాధికారిగా ఉండేవాడు. కడు సంపన్నుడు. ఆయనకు నలుగురు కుమారులు. వారిలో పెద్దవాడు పెత్తందారుగా ఉండేవాడు. రెండోవాడు పశుపోషణా, మూడోవాడు వ్యవసాయమూ చూసుకునే వారు. నాలుగోవాడికి విద్యలో, దైవకార్యాలు ధర్మకార్యాలు చేయటంలో ఆసక్తి హెచ్చు.

కొంతకాలం జరిగాక పెద్దరెడ్డి వృద్ధుడై మంచాన పడ్డాడు. ఆయన కుమారులను పిలిపించి, 'నాయనలారా! ఇంతకాలమూ మనం ఒకరి తగాదాలు తీర్చాము గాని మన తగాదాలను ఇతరుల దగ్గిరికి తీసుకు పోలేదు. నాకు కాలం సమీపించింది. మీరు నా మంచం కోళ్లదగ్గిర మీ ఇష్టాను సారం నిలబడండి. నేను పోయాక ఎవరి కోటి వద్ద వారు తవ్వుకోండి. మీలో మీరు తగాదా మాత్రం పడవద్దు,' అన్నాడు.

కుమాళ్లు నలుగురూ నాలుగు కోళ్లవద్దా నిలబడ్డారు.

'నే చేయగలది ఇంకేమైనా ఉందా?' అని తండ్రి అడిగాడు. మరేమీ లేదని కుమారులు చెప్పిన మీదట 'నారాయణ నారాయణ' అంటూ రెడ్డి నిశ్చితంగా ప్రాణం విడిచాడు.

తండ్రికి దినవారాలు చేసిన అనంతరం నలుగురు అన్నదమ్ములూ నాలుగు గున పాలు తెచ్చి, తండ్రి చెప్పిన ప్రకారం ఎవరి కోటివద్ద వారు తవ్వుకున్నారు. పెద్దవాడు తవ్వినచోట ఊక వచ్చింది. రెండో వాడు తవ్వినచోట పేడ వచ్చింది. మూడోవాడు తవ్వినచోట మట్టితప్ప మరేమీ రాలేదు.

ఎమ్. వీరరాఘవయ్య

నాలుగోవాడు తవ్వినచోట మాత్రం వెండి బంగారాలు దొరికాయి.

ఇది చూసి మిగిలిన ముగ్గురన్నలకూ కోపం వచ్చింది. 'చూశారా? ఆఖరువాడన్న అభిమానం కొద్దీ ఎందుకూ పనికిరాని తమ్ముడికి వెండి బంగారాలిచ్చి మనకు ఊకా, పేడా, మట్టీ చూపించాడు మన తండ్రి,' అనుకున్నారు పెద్దవాళ్లు.

'ఎవరి ఇష్టం వచ్చిన కోటి దగ్గర వాళ్లు నిలబడ్డాం. మీరంతా నిలబడిన తరవాత మిగిలిన కోటి దగ్గరే నేను నిలబడ్డాను. ఇందులో నా తప్పేమీ లేదు. నా అదృష్టం ఇలా ఉంది. మీ అదృష్టం అలా ఉంది. దానికి ఎవరేం చేస్తారు?' అన్నాడు ఆఖరువాడు.

'అదంతా కుదరదంటే కుదరదు. మనం ఈ విషయం న్యాయస్థానంలో పరిష్కారం చేసుకోవలసిందే,' అన్నారు అన్నలు. వారు తండ్రి ఆఖరికోరికను తృణీకరించి, ఉజ్జయినికి వెళ్లి తమ తగాదాను రచ్చకెకించారు.

న్యాయాధికారి వారు చెప్పిందంతా విని, 'మీ తండ్రికి గల ఆస్తి ఏమిటి? వివరంగా చెప్పండి' అని అడిగాడు.

'మా తండ్రిగారికి పొలాలూ, పశువులూ, ధాన్యపు వ్యాపారమూ, వెండిబంగారాలూ ఉన్నాయి,' అని రెడ్డి కొడుకులు బదులు చెప్పారు.

'వాటినే మీ తండ్రి మీకు పంచాడు. ధాన్యపు వ్యాపారం పెద్దవాడిది. పశుసంపద రెండో వాడిది. పొలాలు మూడోవాడివి. వెండిబంగారాలు నాలుగోవాడివి. వాటిని పంచుకుని సుఖంగా ఉండండి,' అని తీర్పు చెప్పాడు న్యాయాధికారి.

ఆ తీర్పు ముగ్గురన్నలకూ ఎంతో ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించింది. మొత్తం మీద తమ తండ్రి ఆఖరువాడిమీద ప్రత్యేకంగా చూపిన అభిమానం ఏమీ లేదని తెలుసుకుని నలుగురూ తమ గ్రామానికి వెళ్లి అప్పటి నుండి ఐకమత్యంగా జీవించసాగారు.





# అపార్థం

శరభయ్య, చలమయ్య అన్నదమ్ములు. చలమయ్య తన అన్న శరభయ్య కన్నా పన్నెండేళ్ళు చిన్నవాడు. తల్లిదండ్రులు గతించడంతో శరభయ్య అతని భార్య సుందరమ్మ, చలమయ్యను ప్రేమగా పెంచి పెద్ద చేశారు. శరభయ్య తనకున్న కాస్త భూమిలో కష్టపడి వ్యవసాయం చేసి కుటుంబాన్ని లాక్కొచ్చేవాడు. సుందరమ్మ కూడా చాకచక్యంగా సంసారం నడిపేది. వీరికి కమలి, నారాయణ అని ఇద్దరు పిల్లలు.

యుక్తవయస్కుడైన చలమయ్యకు పిల్లనిస్తామంటూ ఇరుగు పొరుగు గ్రామాల నుంచి చాలా మంది రాసాగారు. అన్ని సంబంధాల కన్నా తమ ఊరికి సుదూరంలో ఉన్న అనంతయ్య గారి సంబంధం శరభయ్య దంపతులకు బాగా నచ్చింది.

అనంతయ్య బాగా కలిగిన వాడు. అతనికి కాదంబరి ఒక్కటే కూతురు. పిల్ల కాస్తా కూస్తో చదువుకుంది. రూపసి. వాళ్లు అనంతయ్యకు తమ అంగీకారం తెలియజేయగానే అతను శరభయ్య ఉంటున్న గ్రామానికి వచ్చి వాళ్లతో 'అయ్యా, ఇలా చెబుతున్నందుకేమీ అనుకోకండి. ఒక్కటే కూతురని కాదంబరిని అల్లారు ముద్దుగా పెంచాను. దీర్ఘవ్యాధితో మంచం పట్టి ఉన్న తన తల్లి తనను చూడకపోతే ఒక్కరోజు కూడా బతకదు. పైగా మీరు నా వ్యాపారాన్ని గురించి వినే ఉంటారు. మగపిల్లలు లేకపోవడం వల్ల నా బరువు బాధ్యతలు పంచుకునే వాళ్లు లేరు. కాబట్టి మీరు చలమయ్యను మా ఇల్లపుటల్లుడుగా పంపితే నేను మీకు సదా రుణపడి ఉంటాను. అతనికి వ్యాపార బాధ్యతలు అప్పజెప్పి ఆస్తి పాస్తులు అతని పరం చేసి, నిశ్చింతగా కళ్లుమూస్తాను' అన్నాడు.

అతని మాటలకు శరభయ్య దంపతులకు విచారం కలిగింది. వాళ్లు ఇంతవరకూ

ఎ. పుష్పాంజలి



కానీ ఒక్కటే కూతురవడం వల్లనూ, తల్లి దండ్రులు చేసిన గారాబుతనం వల్లనూ, కాదంబరికి బాగా మొండివైఖరి అలవడింది. ఆమెకు శరభయ్య కుటుంబం అంటే కిట్టేది కాదు. వాళ్లతో బంధుత్వం పట్ల విముఖత చూపేది. అత్తగారింటికి ఒక్కరోజు వెళ్లడానికి కూడా ఆమె నిరాకరించేది. అయినా చల మయ్య సహించి ఓర్పుగా సంసారం నెట్టు కొస్తున్నాడు. కాని అతనికి తన అన్నగారి గ్రామానికి వెళ్లడానికి వీలుండేది కాదు. ఒక పక్క వ్యాపారం, మరోపక్క భార్య సహకరిం చకపోవడం ఇందుకు కారణాలు.

వ్యాధిగ్రస్తురాలైన కాదంబరి తల్లి కొన్నా ళ్లకే మరణించింది. అనంతయ్య ఆరోగ్యం కూడా అంత బావుండటం లేదు. దాంతో చలమయ్య పూర్తిగా వ్యాపార నిర్వహణలో మునిగిపోయాడు.

ఇక్కడ శరభయ్య పరిస్థితి చాలా అధ్వా న్నంగా తయారైంది. ఆ ప్రాంతాలన్నీ అతి వృష్టి అనావృష్టికి లోనై కరవు కోరల్లో చిక్కుకు పోయాయి. శరభయ్య కొడుకు నారాయణ చేతికంది రాలేదు. కూతురు కమల పెళ్లి కెదిగి గుండెలమీద కుంపటిలా తయారైంది. ఇటువంటి గడ్డు స్థితిలో తన తమ్ముడు తనను పట్టించుకోకపోవడం, తమను మర్చి పోయినట్లు ప్రవర్తించడం శరభయ్యలో తీవ్ర వేదన రేపింది. కన్నబిడ్డల కన్నా ప్రేమగా చూసుకున్న తమ్ముడు తమను విస్మరిం చడం అతను భరించలేకపోయాడు. చల మయ్య దగ్గరికి వెళ్ళి సాయం అడిగి రమ్మన్న భార్యతో అతను 'చస్తే వెళ్లను' అంటూ భీష్మించుకునేవాడు. అతడిని బ్రతిమిలాడి,

ఎప్పుడూ చలమయ్యను విడిచి ఉండలేదు. కానీ చలమయ్య మంచి చెడ్డలూ, అనం తయ్య పరిస్థితులూ ఆలోచించిన మీదట చలమయ్యను ఇల్లరికానికి పంపేందుకు తమ ఆమోదం తెలియజేశారు. ఇందుకు చలమయ్యను కూడా ఒప్పించారు.

అన్న వదినెలను, లలిత, నారాయణు లను వదిలి వెళ్లవలసి వచ్చినందుకు చల మయ్య ఎంతగానో విచారించినా అన్నగారి ఆదేశం మేరకు కాదంబరిని వివాహం చేసు కుని అత్తవారింటికి వెళ్లాడు. అత్తవారింట్లో అందరూ అతని అడుగులకు మడుగులొత్తే వాళ్లే. అనంతయ్య అతణ్ణి కన్న కొడుకులాగే చూసుకుంటూ వ్యాపారంలో మెలకువలన్నీ నేర్పాడు. త్వరలోనే చలమయ్య వ్యాపార దక్షత సాధించి మొత్తం బాధ్యత తన నెత్తిన వేసుకున్నాడు.



ఎలాగో చలమయ్య దగ్గరికి వెళ్లిరావడానికి ఒప్పించింది సుందరమ్మ.

మరునాడు ఉదయం బండి కట్టుకుని సుందరమ్మ ఇచ్చిన మూట కూడా తీసుకుని, చలమయ్య ఉండే ఊరికి బయల్దేరాడు శరభయ్య. ఆరోజంతా మండుటెండలో ప్రయాణించాక రాత్రికి గానీ ఆ ఊరు చేరలేకపోయాడు. తను చేరిన సమయానికి చలమయ్య ఇంట్లో లేడనీ పొరుగూరు వెళ్లాడనీ తెలిసి హతాశుడయ్యాడు శరభయ్య. కాదంబరి బావగారిని సరిగ్గా పలకరించనైనా లేదు. మంచంలో ఉన్న అనంతయ్య శరభయ్యతో ఆప్యాయంగా మాట్లాడ్డం తప్ప మరేమీ చేయలేకపోయాడు. శరభయ్యకు నడవాలో భోజనం వడ్డించారు పనివాళ్లు. అతనికి పనివాళ్లు తినే కూరలూ, మజ్జిగ నీళ్ళూ మాత్రమే లభించాయి గాని, ఇంటివారు తినే కూరలూ, గడ్డపెరుగూ వెయ్యలేదు. రాత్రి పడుకోవడానికి పరుపూ దుప్పటీ లేని నులకమంచం ఇచ్చారు.

తన దుస్థితికి శరభయ్య విచారించాడు. 'తమ్ముడు మనవాడైతే మర్యాదలు బాగా జరుగును. మేమంటే వాడికే మతింపు లేదు. ప్రేమ లేదు. మిగతావాళ్లకెలా గౌరవాభిమానాలు వస్తాయి? వాడు ఈ డబ్బుండే వాతావరణంలో పడి పూర్తిగా మారిపోయాడు. తల్లిలా చూసిన వదినను కూడా పూర్తిగా మరిచిన కృతఘ్నుడు: అని మనసులోనే చలమయ్యను నిందించాడు.

మరునాడు కాదంబరి అతణ్ణి సమీపించి, 'మీ తమ్ముడు రావడానికింకా పది రోజులు పడుతుంది. మీరేం పనిమీద వచ్చారో నాకు చెప్తే నేను మీ తమ్ముడికి తెలియజేస్తాను,' అన్నది. ఆమె మాటలను బట్టి తనింక వెళ్ళిపోవాలన్న విషయం శరభయ్యకు అర్థమైంది. చలమయ్యకు చెప్పాల్సింది ఏమీ లేదని కాదంబరితో చెబుతూ, అతను తిరుగు ప్రయాణానికి సిద్ధమైనాడు. అలా ప్రయాణిస్తున్న శరభయ్య గుండెలో బాధ సుళ్ళు తిరిగింది. అవమానం అతణ్ణి నిలువునా దహించివేయసాగింది. మండుటెండలో మధ్యాహ్నం వరకూ ప్రయాణించిన శరభయ్య ఒక చెట్టునీడలో కాసేపు విశ్రమించాడు.

నిద్రిస్తున్న శరభయ్యకు గుర్రపుడెక్కల చప్పుడు వినిపించి ఉలిక్కిపడి లేచాడు. దూరంగా రెండు గుర్రాలమీద ఇద్దరు రౌతులు దౌడు తీస్తూరావడం కనిపించింది. వాళ్ల వెనుక రెండు బళ్లు రావడం కూడా

అతనికి కనిపించింది. చూస్తుండగానే వాళ్లు శరభయ్యను సమీపించి గుర్రాలు దిగారు.

వారిద్దరిలో ఒకరు చలమయ్య. రెండవ వాడు అతని అనుచరుడు. చలమయ్యను చూడగానే శరభయ్య కోపం మిన్నంటింది. అతనేమీ అనకుండానే చలమయ్య గబగబా వచ్చి 'అన్నా,' అంటూ శరభయ్యను కౌగిలించుకుని కన్నీరు కార్చాడు.

'అన్నా నువ్వు వచ్చిన సమాచారం రాత్రే నాకు అందింది. కాని నువ్వు ఇంత తొందరగా బయల్దేరతావని అనుకోలేదు. ఇంటికి రాగానే విషయం తెలిసి, నిన్ను దార్లోనే కలుద్దామని హుటాహుటిన ఇలా వచ్చేశాను,' అన్నాడు. చలమయ్య పదిరోజుల వరకూ రాడని కాదంబరి చెప్పిన విషయం గుర్తొచ్చినా శరభయ్య పైకేమీ అనలేదు.

'అన్నా! మన ఊళ్లో కరువొచ్చిందని ఇటీవలే తెలిసింది. కాని పనుల వత్తిడి వల్ల రాలేకపోయాను. కాని ఇవన్నీ సిద్ధం చేసుకుని బయల్దేరే అవకాశం కోసం ఎదురు చూస్తున్నాను,' అంటూ ఆ బండ్లకేసి చూపాడు.

వాటినిండా బియ్యం, పప్పు ఉప్పులూ, ఇతర వంటదినుసులే కాకుండా రెండేళ్లపాటూ ఇంటిల్లిపాదీ వేసుకోగలిగిన కొత్త బట్టలు కూడా ఉండటం చూసి శరభయ్య ఆశ్చర్యపోయాడు.

శరభయ్య చేతిలో చలమయ్య ఒక తోలు సంచీ పెడుతూ, 'ఇందులో కొంతపైకం ఉంది. దానిని మీ అవసరానికి వాడుకోండి. మీకు ప్రతినెలా ఇలా సరుకులు పంపుతాను. కమలకు ఇక్కడే మంచి సంబంధం చూశాను. ముహూర్తం చూసి పెళ్లి చేద్దాం. నారాయణను వ్యాపారంలో పెట్టడానికి తగిన ఏర్పాట్లు చేశాను. మీరు దేన్ని గురించీ విచారపడవద్దు,' అన్నాడు చలమయ్య. అంత మంచి తమ్ముణ్ణి తాను తొందరపడి అపార్థం చేసుకున్నందుకు శరభయ్య పశ్చాత్తాపపడ్డాడు. అతను చలమయ్యను కౌగిలించుకుని భోరుమన్నాడు.

తర్వాత తన బండితోపాటూ, మరి రెండు బళ్లు తోడురాగా శరభయ్య నిశ్చింతగా తన ఊరివైపు సాగిపోయాడు.





# పంచతంత్ర కథలు

సింహం నదిలో స్నానం చెయ్యటానికి వెళ్ళింది. అది వెళ్ళగానే నక్క తోడేలుతో, 'మిత్రమా, మన దొర తిరిగి వచ్చేలోపున నువు కావలిస్తే కొద్దిగా ఎంగిలిపడు, చాలా ఆకలిమీద ఉన్నట్టున్నావు. సింహానికి నేను సర్ది చెబుతాను,' అన్నది.

వెంటనే తోడేలు ఒంటె గుండెను చీల్చి తిన్నది. సింహం నదివద్ద నుండి తిరిగివచ్చి, ఒంటె గుండె లేకపోవడం చూసి, దిక్కుల దిరేలా భయంకరంగా గర్జిస్తూ, 'నా కన్న ముందుగా ఒంటెను తిన్నది ఎవరు? వాణ్ణి చంపిగాని భోజనం చెయ్యను,' అన్నది.

'సర్ది చెబుతానన్నావుగా? చెప్పు!' అన్నట్టుగా తోడేలు నక్క కేసి చూసింది.

కాని నక్క మహా గడుసుగా నవ్వుతూ, 'తోడేలన్నా నాకేసి చూస్తావేం? నువేగా ఇంతకు ముందు గుండె తినేసింది?' అన్నది తడబాటు లేకుండా.

ఠారెత్తిపోయి తోడేలు, ప్రాణం రక్షించుకునేటందుకు పరుగు లంకించుకున్నది. సింహం దాన్ని మహారణ్యంలో చాలా దూరం తరిమి, బాగా అలసి పోయి, 'ఈ కాస్త తప్పుకు తోడేలును చంపేదేమిటి?' అనుకుంటూ తిరిగి రాసాగింది.

సింహం తిరిగి తన స్వస్థలానికి వచ్చేసరికి దానికి గంటల చప్పుడు గట్టిగా వినిపించింది. దానికి కారణమేమిటంటే ఒక ఒంటెల బిడారు ఆ దారిగా పోతున్నది. ఒంటెల మెడల్లో ఉన్న గంటలు గణగణ మోగుతున్నాయి.

'ఆ చప్పుడేమిటి?' అని సింహం నక్కను అడిగింది.

మిత్రభేదం-25



దమనకం వెళ్లినాక సంజీవకం ఇలా ఆలోచించింది: 'నేనిప్పుడేం చెయ్యాలి? ఎక్కడికైనా పారిపోదునా? లాభం లేదు. ఇది మహారణ్యం. నేను ఏ పులివాతనో పడక తప్పదు. సింహమా, శత్రువై కూర్చున్నది. అందుచేత నాకు ఒకటే మార్గం – సింహం వద్దకు వెళ్లి, ప్రాణ బిక్ష వేడటం!'

ఇలా అనుకుని సంజీవకం పింగళకం వద్దకు వెళ్లింది. దమనకం ముందుగా చెప్పినట్లే సింహం తోక నిగిడించి ఉన్నది: పంజాలు బిగబట్టి ఉన్నాయి; ఈ లక్షణాలను దూరం నుంచే గమనించి, సంజీవకం కుమ్మటానికి సిద్ధంగా ఉన్నట్లు కొమ్ములు ముందుకు పెట్టింది.

పింగళకం కూడా, దమనకం ముందే చెప్పిన లక్షణాలను సంజీవకంలో గమనించి, దాని పైన దూకి తన వాడిగోళ్లతో సంజీవకాన్ని చీల్చేసింది. దెబ్బతిని కూడా సంజీవకం పింగళకాన్ని డొక్కలో కొమ్ముతో పొడిచి, కొంచెం వెనక్కు తగ్గి, మళ్ళీ పొడవడానికి సిద్ధమయింది.

ఉభయులూ అలా ఒకరినొకరు చంపుకునేటందుకు గాను యుద్ధ సన్నద్ధులై ఉండటం చూసి, కరటకం దమనకంతో, 'మూర్ఖుడా, మిత్రుల మధ్య శత్రుత్వం రేపి, నువు మహా పాపం చేశావు. శాంతియుతంగా ఉన్న అరణ్యంలో అశాంతి తెచ్చిపెట్టావు. నువు ఏకంగా దండోపాయం

'పారిపొండి మహారాజా, మీకు పెద్ద ప్రమాదం రానున్నది!' అన్నది నక్క.

'ఎవరినుంచి ఈ ప్రమాదం!' అని సింహం అడిగింది.

'రాజా! ఇంతకు ముందు ఒంటెను చంపే సమయంలో మీరు నూరు శాతం వడ్డీ కూడా ఇస్తామని మృత్యుదేవతకు మాట ఇచ్చారు కదా, అసలూ, వడ్డీ రెండూ వసూలు చేసుకునేటందుకు మృత్యుదేవత ఇక్కడకు వస్తున్నది,' అన్నది నక్క.

ఈ మాట వింటూనే సింహం దడుచుకుని అక్కడినుంచి పలాయనం చిత్తగించింది. తరువాత నక్క ఒంటె శరీరాన్ని చాలా రోజులపాటు నిరభ్యంతరంగానూ, నిస్సంకోచంగాను తిన్నది.

అవలంబించి, మన ఏలికకు ప్రాణాపాయ స్థితి కలిగించావు. ఆయన ఇతరులను సంప్రదించే అవకాశం ఏమాత్రం ఇవ్వకుండా మంత్రాలోచన అంతా నువ్వే చేశావు. నీ వంటి మూఢుడి మంత్రాలోచనలు విన్నందుకు మన యజమాని తప్పు కూడా లేకపోలేదు. మూఢులైన రాజులు నీలాటి ఇచ్చకాలరాయుళ్ల మాటలు విని తమ నాశనం కొని తెచ్చుకుంటారు. నీలాంటి వాడికి హితవు చెప్పడం కూడా వృధా. వెనకటికి కోతికి చెప్పిన హితవులాగే ఉంటుంది,' అన్నది.

'ఏమిటా కథ?' అని దమనకం అడిగింది. కరటకం ఇలా చెప్పింది.

నిరర్థకమైన హితవు

ఒక అరణ్యంలో కోతులమంద ఉండేది. చలికాలం వచ్చి, కోతులన్నీ వణికి పోతున్నాయి. ఇంతలో వాటికొక మిణుగురు పురుగు కనబడింది. దాన్ని చూసి నిప్పు రవ్వ అనుకుని దాని సహాయంతో మంట చేద్దామని దాన్ని పట్టుకుని దాని మీద ఎండుటాకులు కప్పి, మంటకు వెచ్చబడదామని పోగు దగ్గిర చేరాయి.

వాటిలో చలి బాధ మరీ ఎక్కువగా ఉన్న ఒక కోతి, మంట త్వరగా కావటానికి మిణుగురు పురుగుమీద ఊదసాగింది. సమీపంలోగల ఒక చెట్టు మీద ఉన్న సూచీముఖి అనే ఒక పక్షి ఇదంతా చూసి, 'మిత్రమా, ఎందుకు వృధాగా ప్రయాస పడతావు? అది నిప్పు కాదు. మిణుగురు పురుగు,' అని చెప్పింది.

కోతి వినిపించుకోకుండా, అదే పనిగా ఊదుతూ పోయింది.

సూచీముఖి మళ్ళీ మళ్ళీ కోతికి బోధ చేసింది. కోతికి చిరాకు వచ్చి సూచీముఖిని నోరు మూసుకోమన్నది. బుద్ధి మాలిన సూచీముఖి అదేపనిగా కోతికి హితవు చెప్పసాగింది. (ఇంకా వుంది)





# మెత్తని నేల

ఆ రోజు క్లాసులో మాస్టారు 'తల్లి దైవంతో సమానం' అనే పాఠం మొదలుపెట్టారు.

ఆలస్యంగా వచ్చిన చిన్నా తరగతి గుమ్మం ముందు నిలబడి 'మాస్టారూ! నేను లోపలికి రావచ్చా?' అని అడిగాడు.

'ఏం కిషోర్ ఇంతాలస్యం? ఇప్పుడు సమయం ఎంతయిందో తెలుసా?'

చిన్నా నసిగాడు.. 'మరేమో...'

మాస్టారు 'సరే... లోపలికి రా.. ఈసారి ఆలస్యమయితే క్షమించేది లేదు' అన్నారు.

చిన్నాకి కాస్త ధైర్యం వచ్చింది. 'మరేమో.. మా అమ్మ నిద్ర లేపలేదండీ...'

'మీ అమ్మగారే నిద్ర ఎందుకు లేపాలి? రాత్రి త్వరగా పడుకుంటే తెల్లారకముందే తెలివొస్తుందిగా' అన్నారు మాస్టారు.

'రాత్రి మా నాన్న టీవీ చూస్తారుగదండీ.. సినిమాలంటే నాకూ ఇష్టమే. నేనూ అర్ధ రాత్రి దాకా చూస్తాను. మరి మా అమ్మ పడుకోమని గుర్తు చెయ్యాలి కదండీ' అన్నాడు తప్పును తల్లిమీదకి నెట్టేస్తున్నట్టుగా. తరగతి గదిలో పిల్లలంతా ఘొల్లున నవ్వారు.

మాస్టారు 'సైలెన్స్... సైలెన్స్...' అని పిల్లలను మందలిస్తూ 'కిషోర్! సరేగాని హోంవర్క్ చేసావా?' అని అడిగారు.

చిన్నా నీళ్లు నమిలాడు. 'హోంవర్క్... మరి మా...'

తరగతిలోని ఓ కొంటె కుర్రాడు కీచు గొంతుతో అరిచాడు 'అమ్మ చేయించలేదు కదండీ'. పిల్లలంతా మళ్లీ నవ్వారు.

మాస్టారు 'ఏం కిషోర్... మీ అమ్మగారు చెప్పందే ఏ పనీ చెయ్యవా?'

చిన్నా కంఠంలో విసుగు తొంగి చూసింది. 'ఛ... అసలు మా అమ్మ చెప్పిన పనేదీ చెయ్యాలనే అనిపించదండీ' అనేసాడు.

పారుపూడి వెంకట సత్యనారాయణ

మాస్టారు ముఖంలో ఆశ్చర్యం. 'అంటే? ఏం... ఎందుకనిపించదు?'

'నాకే కాదు మా చెల్లికీ వినాలనిపించదు. మా చెల్లికే కాదు మా నాన్నకు కూడా ఎంతో కోపం వస్తుంది మా అమ్మ ఏం చెప్పినా.'

'కిషోర్.. ఇలారా.. మీ అమ్మగారు చెడ్డ వారా?' చిన్నాకి ఏం చెప్పాలో అర్థం కాలేదు.

'పోనీ కోపంగా చెప్తారా ఏ పనయినా?'

'కాదు... బతిమాలుతూ పదే పదే చెబుతూంటే చిరాకేస్తుంది...'

'ఏమేం చెప్తూంటే చిరాకేస్తుందో చెప్పు'

'మరేమో పొద్దుటే లేచి, హోంవర్క్ రాత్రే పూర్తి చేసి...' ఆగిపోయాడు.

'అది మంచి పనేగా...'

'సినిమాలు చూడకుండా పెందరాళే నిద్ర పొమ్మని చెబుతుంది. మాస్టారూ.. కాని సినిమాలు చూడకుండా మా నాన్నే ఉండలేరు. మరి చిన్నపిల్లలం మేమెలా ఉండగలం.. మా కిష్టమైన పనులు మా అమ్మ మానెయ్యమంటే మాకు చిరాకు కాదా?'

మాస్టారు నిట్టూర్చారు. 'ఇప్పుడర్థం అయిందిరా అసలు సంగతి? సరేగాని మీ నాన్న చేసే పనులు నీకింకా ఏమిష్టమో చెప్పు' అన్నారు. 'మరి... మరి... మా నాన్న గుప్పుగుప్పుమని రైలింజన్లా పొగ వదులుతూ సిగరెట్లు కాలుస్తుంటే సరదాగా ఉంటుంది. నేనూ అలా పొగ వదిల్తే ఎంత బాగుంటుందో అనిపిస్తుంది.'

మాస్టారు చిన్నాని వారించారు. 'కిషోర్... ఇంక చెప్పనవసరం లేదు. చూడు నాయనా.. నేనంటే నీకిష్టమేనా?'



'చాలా ఇష్టం మాస్టారూ నాకేకాదు. మా క్లాసంతటికీ ఇష్టమే. మీరెంతో నెమ్మదిగా అర్థమయేలా పాఠాలు చెప్తారు'.

'అయితే నా మాట వింటావా?'

'తప్పకుండా వింటాను మాస్టారూ...'

'మీ అమ్మగారంటే నీకిష్టంలేదు గదా... ఆవిడని ఇంట్లోంచి పంపేస్తే బావుంటుందా?'

చిన్నా కళ్లలో వాడికి తెలియకుండానే నీళ్లూరాయి. 'మాస్టారూ! అన్నాడు. ఆ కంఠం లోని తడి మాస్టారికి అర్థమయింది. మాస్టారు గంభీరంగా అన్నారు. 'అవును కిషోర్ అన్నీ నీకిష్టంలేని పనులే చెయ్యమంటుందిగా ఆవిడ?'

'కానీ మేము అన్నం తినకపోతే ఏడుస్తుంది మా అమ్మ. మాకు జ్వరం వస్తే నిద్ర పోకుండా తెల్లవార్లూ మా పక్కనే కూర్చుంటుంది'.

'మరి అలాంటి మీ అమ్మ అన్నీ నీకిష్టం లేని పనులే నీ కెందుకు చెప్తుందనుకుంటావు?'

చిన్నాకి ఏం చెప్పాలో అర్థంకాలేదు. 'అవి.. అవి...' ఈసారి మాస్టారి కంఠంలో దయ ప్రవహించింది.

'చూడు నాయనా – మనల్ని సృష్టించిన దేవుడు తానే అన్నిచోట్లా ఉండలేక లోకంలో అమ్మను సృష్టించాడు. తల్లిని మించిన దైవం ఈ ప్రపంచంలోనే లేదు. మిమ్మల్ని కని, పెంచి కంటికి రెప్పలా కాచే తల్లి మీకిష్టం ఉన్నా లేకున్నా మీ బాగు కోరి మీ హితవు చెప్తుంది. అటువంటి అమ్మ మనసు బాధపెట్టడం ఎంత తప్పు బాబూ! నువ్వు రాత్రి పెందరాళే పడుకుంటే త్వరగా లేవగలుగుతావని, పాఠశాలకు ఆలస్యం కావని, నీ హోంవర్కు రాత్రే చేసేసుకుంటే తరగతిలో నువ్వు దెబ్బలు తినవని మీ అమ్మ ఆశ కదా బాబూ!'.

చిన్నా లేత మనసులో పశ్చాత్తాపం మొదలయింది. 'మాస్టారూ నేనెంత పొరబాటు చేస్తున్నానో తెలిసింది. అయితే మరి మా నాన్న చెడ్డవాడా?'

'కాదు కిషోర్ – కానీ పసివాళ్లు తనను అనుకరిస్తారని, ఆయన చేస్తోన్నది తప్పని ఆయనకు తెలీడం లేదు. ఆయనతో నేను మాట్లాడతాలే...' అని క్లాసులో తక్కిన పిల్లలవైపు తిరిగి 'సరే... పిల్లలూ ఈరోజు నా పాఠం ఇదే – మాతృదేవోభవ... తల్లిని ఎందుకు గౌరవించాలో బాగా అర్థమయింది కదా!' అంటూండగానే గంట మోగింది. పిల్లలు అందరూ బిలబిలమంటూ లేచి బయటకి పరిగెత్తారు. కాని చిన్నా మాత్రం మాస్టారి మాటలనే మననం చేసుకుంటూ ఆలోచనలో పడ్డాడు. 'ఇంక చెల్లి, తను ఈరోజు నుంచి అమ్మ మాటలను గౌరవించాలి' అని.

మాస్టారికి తప్పక తెలుసు...

'పసిపిల్లల మనసులు మెత్తని నేల లాంటివి. అక్కడ నాటిన మంచిమాటలనే విత్తనాలు త్వరగా నాటుకుని మొలకలెత్తి ఫలిస్తాయి'.





# అవిశ్వాసం

మా ఊరులోని పెద్దదుకాణం యజమాని నారాయణస్వామిని ఎరగని వారంటూ లేరు. అతని పెద్ద గుమస్తా హరిబాబు మా తాతయ్య దగ్గిర ఒకప్పుడు చదువుకున్నాట్ట. అతని ద్వారా నారాయణ స్వామి భోగట్టా లన్నీ మాకు చేరేవి. ఒంటరివాడైన స్వామి, తనలాగే అనాథ అయిన రంగాజీ అనే చిన్నప్పటి స్నేహితుణ్ణి ఆదరించి సమాన స్థాయినిచ్చి తన దగ్గిరే ఉంచుకున్నాట్ట.

వాళ్లిద్దర్నీ యజమానీ నౌకరూ అనుకోకుండా ప్రాణ స్నేహితులుగా చెప్పుకుంటారు అందరూ. వాళ్ల మధ్య ఏమొచ్చిందో మరి, ఈ మధ్య రంగాజీ స్వామిని విడిచిపెట్టి తన గ్రామానికి వెళ్లి పోయాట్ట! ఇది తెలిసి మా పిల్లలందరం తాతయ్య దగ్గిరకెళ్లి అడిగాం ''లక్షల వ్యాపారం కదా, డబ్బు లావాదేవీల్లోనే ఏదో పేచీ వచ్చి ఉండాలి. లేపోతే ఇన్నేళ్లూ తోడూ నీడలా ఉండే రంగాజీని నారాయణస్వామి ఎందుకు పంపించేస్తాడు?'' అంటే తాతయ్య ఇలా అన్నాడు:

'స్వామి రంగాజీని పంపించెయ్యలేదు. అదికాక ఇది డబ్బు వ్యవహారమూ కాదు' అంటూ తాతయ్య విషయాన్ని మరింత విశదీకరించాడు.

నారాయణస్వామికి చిన్నప్పుడే తల్లీ దండ్రీ పోవడం కాక, పురిట్లోనే భార్యాబిడ్డా చనిపోడంతో ఏకాకి అయిపోయాడు. జీవితంమీద విరక్తి పుట్టి మరి పెళ్లి చేసుకోలేదు. వ్యాపారమే జీవితంగా బతుకుతున్న అతనికి చిన్ననాటి మిత్రుడు రంగాజీ కలసి, విడరాని బంధమయింది.

రంగాజీ ఒంటరివాడే కాక బాగా బీదవాడు కూడా. అతని నిజాయతీని, కార్య

అవసరాల రామకృష్ణా రావు

దక్షతనీ గుర్తించి, వ్యాపార మెళకువలు నేర్పి, వాటా కూడా యిస్తానని నారాయణ స్వామి సిద్ధపడితే రంగాజీ ఒప్పుకోలేదు. 'కూడూ గుడ్డతోపాటు ప్రేమా అభిమానమూ యిచ్చారు. నన్నిలాగే ఉండనివ్వండి బాబుగారూ!' అంటూ వినయం చూపించాడు.

ఇలా ఉండగా ఓసారి స్వామి వేలునున్న ఉంగరంలోని అమూల్యమైన వజ్రం కనపడకుండా పోయింది. భార్య బతికున్నప్పుడు ప్రేమతో కానుకగా యిచ్చిన ఆ కానుక నారాయణ స్వామికి ప్రాణప్రదం. అరుదైన ఆ విదేశపు వజ్రపురాయి ఖరీదే అరకోటికి మించుతుందని రంగాజీతో ఎన్నోసార్లు చెప్పేడట కూడా. తనదీ, రంగాజీదీ పక్క పక్క గదులే. తాము తప్ప పురుగైనా జొరబడని కట్టుదిట్టమైన భవనం అది. పొద్దుటికి ఉన్నది ఇప్పుడు లేకుండా రెక్కలొచ్చి ఎగిరిపోయిందా, ఎన్నిసార్లు ఎన్నిచోట్ల వెదికినా, కనపడదేం?

రంగాజీ గదిలోకి వచ్చి 'ఏ బలహీన క్షణంలోనో నువ్వే తీసి ఉంటావు. ఎవరికీ చెప్పను. ఇచ్చేయ్' అని చెప్పి తన గదిలోకి వచ్చేశాడు స్వామి. తీరా చూసుకుంటే ఆ దుప్పటి మడతల్లో అక్కడే చిక్కుకుని కనిపించింది వజ్రం! అపరాధ భావనతో స్వామి ఇవతలి గదికొచ్చి రంగాజీ రెండు చేతులూ పట్టుకుని క్షమాపణ కోరేడు.

అప్పటికే పెట్టే బేడా సర్దేసుకుని వెళ్లిపోవడానికి సిద్ధంగా ఉన్నాడు రంగాజీ! స్వామి ఎంత బతిమాలినా ఆగలేదు. వెళ్లే ముందు మాత్రం మెత్తని చెప్పుదెబ్బలాంటి చురక తగిలించాడు:

'పొరపాటు మీది కాదు, నాది బాబుగారూ! మీరేమో నన్ను 'దొంగ' అనుకున్నారు, నేనేమో మిమ్మల్ని 'పెద్దమనిషి' అనుకున్నాను, అంతే!'.

మానవసంబంధాలన్నీ పరస్పర విశ్వాసం మీదే నడుస్తాయి. అది చెదిరి మనసు విరిగిపోతే మంచివాళ్లు మరక్కడ ఉండలేరు.





# పోటీ

అనుపల్లె గ్రామంలో రత్నాచారి అనే మిఠాయి వ్యాపారి ఉండేవాడు. అతని తాతల కాలం నుంచి ఆ చుట్టుపక్కల గ్రామాల్లో వాళ్ల మిఠాయి చాలా ప్రసిద్ధి. తక్కువ ధరకే నాణ్యమైన సరుకు అందించడం వల్ల తరతరాలుగా వాళ్ళ వ్యాపారం నిలకడగా సాగిపోతోంది.

తాత తండ్రులు చేసిపోయిన ఆ అలవాటే రత్నాచారికి నచ్చలేదు. అతనికి అసలే లాభాలమీద ఆపేక్ష ఎక్కువ. ధర పెంచితే జనం తిడతారు. పెంచకపోతే తనలాభం పెరగదు. అందుకని రత్నాచారి బాగా ఆలోచించి ఆలోచించి నెమ్మది నెమ్మదిగా మిఠాయిల నాణ్యత, వాటి పరిమాణం జనం గుర్తించలేనంతగా తగ్గించి అమ్మకాలు సాగించసాగాడు.

ఆ దుకాణంలో మిఠాయి అంటే జనానికున్న నమ్మకం వల్ల ఆ విషయం ఎవరూ పట్టించుకోక గుర్తించలేకపోయారు. అయితే జనం గుర్తించడం లేదన్న రత్నాచారి అతి నమ్మకం, అత్యాశ వల్ల, రాను రానూ మిఠాయిల నాణ్యత, పరిమాణం నానాటికి తీసికట్టు అయిపోయాయి. అయినా జనానికి వేరే దారి లేక చచ్చినట్టు రత్నాచారి దుకాణంలో మిఠాయిలు కొనసాగారు.

ఆనోటా ఈనోటా ఈ విషయం నాని గ్రామాధికారి మల్లన్నకు తెలిసింది.

'రత్నాచారి వాళ్ళది పెద్ద కుటుంబం. పేరున్న కుటుంబం. అలాంటి వాడిని ఎదురుగా నిలదీసేకన్నా లోపాయికారిగా బుద్ధి చెప్పాలి' అనుకున్న మల్లన్న

వెంకటేష్

చక్కని ఆలోచన చేశాడు. ఫలితంగా వారం తిరక్కముందే ఆ ఊళ్లో తాత్కాలికంగా మరో మిఠాయి దుకాణం ఏర్పాటయింది.

నాణ్యమైన సరుకు అతి తక్కువ ధరకే ఆ దుకాణంలో లభిస్తూ ఉండటంతో అంతా అక్కడికే ఎగబడసాగారు.

క్రమంగా రత్నాచారి దుకాణం ఖాళీ అయిపోయి అతను ఈగలు తోలుకుంటూ కూర్చోవలసి వచ్చింది.

పరిస్థితి ఇలాగే కొనసాగితే తను దివాళా తీయక తప్పదని గ్రహించిన రత్నాచారి, మళ్ళీ తన పూర్వీకుల పద్ధతిలోనే నాణ్యమైన సరుకు దానికి తయారు చేయించి, తక్కువ లాభం వేసుకుని ధరలు నిర్ణయించి, ఆ విషయం ప్రచారం చేయించాడు.

దాంతో అతనికి పూర్వ వైభవం వచ్చింది. తాత్కాలిక దుకాణం మాయమయింది. 'ఆ రత్నాచారికి చక్కగా బుద్ధి చెప్పారు. ఇప్పుడు చూడండి. తక్కువ ధరకే ఎంత మంచి మిఠాయి అమ్ముతున్నాడో,' అంది మల్లన్న భార్య అతనికి రత్నాచారి దుకాణంలోని మిఠాయి పళ్ళెంలో పెట్టి అందిస్తూ.

'పోటీలేని చోట వ్యాపారిలో అలసత్వం, అతి నమ్మకం పెరుగుతాయి. అది వినియోగదారుడికి నష్టం కలిగిస్తుంది. పోటీ ఉన్న చోట వ్యాపారుల్లో లాభాపేక్ష తగ్గి, తమదే నాణ్యమైన వస్తువని వినియోగదారుడు అనుకోవాలనే తాపత్రయం పెరుగుతుంది. అది వినియోగదారుడికి లాభం.

అందుకే రత్నాచారికి పోటీ వ్యాపారిని సృష్టించి, నాణ్యమైన సరుకు అందించక తప్పని పరిస్థితి కల్పించాను,' అంటూ మిఠాయి ముక్క నోట్లో వేసుకున్నాడు మల్లన్న.





# అహంకారం

చాలాకాలం కిందట కుముదుడనే మహర్షి విష్ణువును గూర్చి, ఘోరతపస్సు చేశాడు. కొంతకాలానికి విష్ణువు లక్ష్మీ సమేతుడై ఆయనకు ప్రత్యక్షమయాడు. సాష్టాంగ నమస్కారం చేసి, చేతులు జోడించి ఎదుట నిలబడిన కుముదుడిని ఏమి వరం కావాలో కోరుకోమన్నాడు మహావిష్ణువు.

ఏ కోరికలూ లేకుండా, కేవలం విష్ణు దర్శనం కోసమే కుముదుడు తపస్సు ప్రారంభించాడు. అలాంటిస్థితిలో విష్ణువు వరం కోరుకోమనేసరికి అతడు తికమక పడ్డాడు.

లక్ష్మీదేవి కుముదుడి మనస్థితిని గ్రహించినదై ఇలా అన్నది. ''వత్సా, నీ భక్తికి మెచ్చాము. అనాలోచితంగా ఇప్పుడే ఏదో వరం కోరుకోనవసరం లేదు. మేము మళ్ళీ మాసం రోజుల్లో నీకు దర్శనం ఇస్తాము. ఈ గడువులో బాగా ఆలోచించి నీకు కావలసిన వరం ఏదో కోరుకోవచ్చు!''

లక్ష్మీదేవి ఇలా అనేసరికి కుముదుడు స్థిర చిత్తుడయ్యాడు. మరుక్షణంలోనే మహావిష్ణువు లక్ష్మీ సమేతంగా అదృశ్యుడయ్యాడు.

కుముదుడు తన తపస్సు ఫలించింది కదా అని మహదానందం పొందాడు. తరవాత తన ఆశ్రమానికి తిరిగివచ్చి శిష్యులకు ఈ శుభవర్తమానం తెలిపాడు.

గురువుగారి అమోఘ తపశ్శక్తికి శిష్యులంతా అబ్బురపడ్డారు. సాక్షాత్తూ ఆ మహా విష్ణువే ప్రత్యక్షమై వరం కోరు

మధురశ్రీ



వును ప్రశ్నించారు. అందుకు కుము దుడు సమాధానమిస్తూ...,

'ఈ రైవతుడు రుషినామానికి ఎలా అర్హుడో నాకు తెలియటం లేదు. సర్వ సంగపరిత్యాగం చేసి, ఆకులలములు తింటూ అడవుల్లో తపస్సు చేసేవాళ్లకే దైవదర్శనం దుర్లభం గదా?' అన్నాడు ఈసడింపుగా.

అలా అన్నాడే కాని కుముదుడికి తన జవాబు తనకే సంతృప్తికరంగా లేదు. 'సరే, విష్ణుమూర్తి ఇక కొద్ది దినాల్లో ప్రత్యక్షమవుతాడు గదా ఆయననే అడిగి సంశయ నివారణ చేసుకుందాం' అను కున్నాడు.

కోమన్నా కోరుకోని ఆయన త్యాగాన్ని వేనోళ్ల ప్రస్తుతించారు. ఈ పదునాలుగు భువనాల్లో ఇంత సర్వసంగ పరిత్యాగి, మహాభక్తుడు లేడని పొగడసాగారు. ఈ పొగడ్తలతో కుముదుడిలో అహంభావం ఏర్పడింది. తనకంటే మహర్షి శ్రేష్టుడు ఎక్కడా లేడని భావించసాగాడు.

ఈ స్థితిలో కుముదుడు ఒకనాడు గంగానదికి శిష్యులతో కలిసి స్నానానికి వెళ్లాడు. అక్కడ వీళ్ళకు నదిలో స్నానం చేసి వస్తూన్న రైవతుడు అన్న రాజర్షి ఎదురయ్యాడు. భార్యా, పదిమంది పిల్లలూ - ఈయనేమి రుషి అన్న సంశయం కలిగింది కుముదుడి శిష్యు లకు. సంశయ నివృత్తికై వాళ్లు గురు

నెలరోజులు జరిగిపోయేసరికి విష్ణు మూర్తి లక్ష్మీసమేతుడై తిరిగి కుముదు డికి ప్రత్యక్షమయ్యాడు. వరాలు కోరే సంగతి మరిచిపోయిన కుముదుడు, రైవత రాజర్షిని గురించిన తన సంశయం తీర్చవలసిందని విష్ణుమూర్తిని అడి గాడు.

అందుకు మహావిష్ణువు చిరునవ్వుతో 'కుముదా! నాకు భక్తి ఒక్కటే ప్రధానం. మనస్సు నిర్మలం కానప్పుడు సన్యాసం స్వీకరిస్తే మాత్రం ఏముంది? అయినా నీకు పూర్తిగా సంశయ నివృత్తి కావా లంటే శ్రీశైలం దగ్గిర ఉన్న స్వర్ణాగ్రహారా నికి వెళ్లు. అక్కడ సుధర్ముడు అనే ఆయన వల్ల సంశయ నివృత్తి కలుగు

తుంది!' అని జవాబు చెప్పి అంతర్ధాన మయ్యాడు. తర్వాత కుముదుడు తన శిష్యబృందంతో శ్రీశైలానికి బయలుదే రాడు. కొన్ని రోజుల ప్రయాణానంతరం అక్కడికి చేరాడు. ఒకనాటి ఉదయం శిష్యులు వెంటరాగా పాతాళగంగలో స్నానానికి వెళ్లాడు. అందరూ స్నానాలు చేస్తున్న సమయంలో ఒక ముసలి వచ్చి కుముదుడి కాలు పట్టుకున్నది.

గురువుగారిని మొసలి పట్టుకోవటం చూసిన శిష్యులు భయకంపితులైకేకలు వేయసాగారు. కాని కుముదుడు నిర్భ యంగా ఆ మొసలికేసి తీవ్రదృక్కులతో చూశాడు. అతని తపోశక్తివల్ల మరు క్షణమే మొసలి గిలగిల కొట్టుకుని ప్రాణాలు విడిచింది. ఈ సంఘటనతో కుముదుడిలోని అహంభావం మరికాస్త వృద్ధి అయింది.

ఒకటి రెండు రోజుల తరవాత కుము దుడు స్వర్ణాగ్రహారానికి వెళ్ళాడు. తీరా ఆయన అక్కడకి వెళ్ళేసరికి సుధర్ముడు ఇంటలేడు. సుధర్ముడి భార్య ఆ సమ యంలో తలుపు పక్కనే కూర్చుని ఒక పాత చీర చిరుగులు కుట్టుకుంటోంది. కుముదుడిని చూసి, భర్త వచ్చేవరకు ఆ బైట అరుగుమీద కూర్చోవలసిందిగా చెప్పింది.

తనవంటి గొప్ప రుషికి తగిన మర్యాద జరగలేదని కుముదుడికి చాలా కోపం



వచ్చింది. తలుపుచాటున కూర్చుని ఉన్న సుధర్ముడి భార్యకేసి తీవ్రదృక్కు లతో చూశాడు కాని మొసలిలాగా ఆమె గిలగిల తన్నుకుని కింద పడిపోలేదు. దీనితో కుముదుడికి తన తపోశక్తిమీద కొంత అపనమ్మకం ఏర్పడింది.

అంతలో సుధర్ముడు అక్కడికి వచ్చి అతిథుల నందరినీ గృహంలోకి ఆహ్వా నించాడు. కాసేపటికల్లా వంట సిద్ధం చేసి అందరికీ భోజనం వడ్డించింది సుధ ర్ముడి భార్య.

కుముదుడు విస్తరి ముందు కూర్చు న్నాడు. వంటకాలు ఏ కారణం చేతనో చాలా చల్లగున్నాయి. కుముదుడికి చాలా కోపం వచ్చింది. అతడు హేళనగా--

'సుధర్మా! వంటకాలన్నీ తగని వేడి మిగా ఉన్నాయి!' అన్నాడు.

సుధర్ముడు, కుముదుడి హేళనను గ్రహించాడు. 'స్వామీ, అయితే ఈ విసనకర్రతో విసురుతాను!' అంటూ చేతనున్న విసనకర్రతో విసరసాగాడు.

నిమిషంలో కుముదుడి విస్తటిలోని పదార్థాలన్నీ వేడెక్కి పొగలు విడవ సాగినై. కుముదుడు ఆశ్చర్యపోయాడు.

చేయి కడుగుకునేందుకు బావిదగ్గ రకు వెళ్తే అక్కడ మరో వింత దృశ్యం కుముదుడిని కలవరపెట్టింది. బావి గిలక మీద సగం వరకు లాగి వదిలిన చేంతాడూ, బావిలో వేలాడుతూ ఉన్న నిండు బొక్కెనా అతడి కంటబడినై.

'నీళ్లు చేదుతూ చేదుతూ ఉండగా, మావారు పిలిస్తే చేద అక్కడే వదిలి వెళ్లాను,' అంటూ సుధర్ముడి భార్య నవ్వుతూ కుముదుడితో చెప్పింది.

తన కంటే గొప్ప తపశ్శాలి లేడనీ, సంసార కూపంలో పడి ఉన్నవాళ్లు అల్పు లనీ భావించే కుముదుడికి గర్వభంగ మయింది. అతడు చేతులు జోడించి సుధర్ముడికి నమస్కరిస్తూ, 'సుధర్మా, మీరు మహనీయులు! సర్వసంగపరి త్యాగులై తపస్సు చేయనివారిక్కూడా మోక్షం ఉంటుందా?' అని అడిగాడు.

అందుకు సుధర్ముడు, 'కుముదా! నిర్మలమైన మనస్సుతో దేవుడిని ఎక్కడ ఉండి ప్రార్థించినా ముక్తి లభ్యమవు తుంది. అడవులలో కందమూలాలు తింటూ ముక్కు మూసుకు కూర్చున్నా. నిర్మలమైన మనస్సులేని అహంకారికి మోక్షద్వారం తెరవబడదు!' అని చెప్పాడు.

కుముదుడికి సంశయనివృత్తి కలగ టమే కాక, అహంకారం కూడా నశిం చింది. ఆనాటి నుంచి నిర్మల చిత్తంతో భగవధ్యానం చేసి ముక్తి పొందాడు.





# ఇంటి పెత్తనం

పూర్వం ఒక ఊళ్లో దండపాణి అనే గృహస్థు ఒకడుండేవాడు. ఆయన భార్య పేరు భద్ర. వారికి నలుగురు కుమారులు. నలుగురికీ వివాహాలు జరిగి భార్యలు కాపురాలకు వచ్చారు.

భద్రమ్మ ఇంటి పెత్తనంలో చాలా సమర్థురాలు. కాని తన తదనంతరం తన నలుగురు కోడళ్లలో ఎవరు తన స్థానం స్వీకరించగలుగుతారా అని ఆవిడకు బెంగపట్టుకుంది.

తన భార్య విచారం గ్రహించి దండపాణి నలుగురు కోడళ్ళనూ పరీక్షించ దలుచుకున్నాడు. ఒక్కొక్క కోడలినీ పిలిపించి, తలా అయిదు వడ్లగింజలూ ఇచ్చి, తాను తిరిగి అడిగే దాకా వాటిని భద్రపరిచి పెట్టమని హెచ్చరించాడు.

పెద్దకోడలు ఉజ్జిక ఈ విధంగా ఆలోచించింది. 'తమ ఇంటినిండా ఎప్పుడూ ధాన్యం ఉండనే ఉంటుంది. మామగారు ఏ క్షణాన అయిదు వడ్లగింజలు తిరిగి ఇమ్మని అడిగినా గాదెలోంచి తీసుకుపోయి ఇవ్వవచ్చు. ఈ భాగ్యానికి ఈ వడ్లగింజలను భద్రపరిచేదేమిటి?' ఇలా అనుకుని ఉజ్జిక మామగారు ఇచ్చిన అయిదు వడ్లగింజలూ అవతల పారేసింది.

రెండో కోడలు భోగవతి కూడా ఉజ్జిక లాగే ఆలోచించింది. అయితే ఆమె తన వంతు వడ్లగింజలను అవతల పారెయ్యడానికి బదులు పొట్టు ఒలిచి నోట్లో వేసుకుంది. మూడవకోడలు రక్షిక మామగారిచ్చిన వడ్లగింజలను భద్రంగా పొట్లం

పాలంకి వెంకట రామచంద్రమూర్తి



కట్టి తన పెట్టె అడుగున దాచింది. నాలుగవ కోడలు రోహిణి ఈ విధంగా ఆలోచించింది. 'మామగారిచ్చిన ఈ గింజలను తిరిగి ఎప్పటికి అడుగుతారో తెలియదు. వడ్లగింజలు భద్రం చేసేది తినడానికి లేదా నాటడానికి. ఈ ఆయిదు గింజలు తినడానికేమూల. అందుచేత వీటిని భద్రం చేయడమంటే తిరిగి తరుణం వచ్చినప్పుడు నాటడమే.' ఇలా అనుకుని రోహిణి తనకు మామగారిచ్చిన వడ్లగింజలను పుట్టింటికి పంపి పొలంలో నాటేయించింది.

రోహిణి పుట్టింటివారు ఆ అయిదు గింజలనూ నాటి అయిదు వరిమొక్కలు పెంచారు. పంట వచ్చాక కోశారు. మరుసటేడు గింజలకోసం కబురు రాలేదు. అందుచేత పంట యావత్తూ విత్తనాలుగా ఉపయోగించి మరుసటేడూ పండించారు.

ఈవిధంగా వరుసగా అయిదేళ్లూ గడిచాయి. 'ఏమండీ, నేను చూస్తే పెద్దదాన్నయిపోయాను. ఇక ఇంటి పెత్తనం నా వల్ల కాదు. కోడళ్లలో ఎవరికి పెత్తనం వప్పగించాలో తేల్చిచెబుతానన్నారు. ఐదేళ్లు గడిచినై. ఇకనైనా ఏదో విధంగా నిర్ణయించండి,' అన్నది భద్రమ్మ తన భర్తతో.

దండపాణి సరేనని, తాను దాచమని ఇచ్చిన అయిదేసి వడ్లగింజలనూ తిరిగి తీసుకురమ్మని కోడళ్లనూ అడిగాడు. పెద్ద కోడళ్లు ఉజ్జికా, భోగవతీ కూడా గాదెలోనుంచి అయిదేసి వడ్లగింజలు తెచ్చి వాటిని మామగారి ఎదుట పెట్టారు. మూడవ కోడలు రక్షిక తన పెట్టె అడుగునుంచి పొట్లం తీసి నల్లబడిపోయిన వడ్లగింజలను తీసుకుని వచ్చి మామగారికి ఇచ్చింది.

దండపాణి వాటికేసి చూసి, 'ఇవి నిజంగా నేనిచ్చినవే!' అన్నాడు. ఉజ్జికా, భోగవతీ తెచ్చిన గింజలు కొత్తపంటవి గనుక బంగారం రంగులో ఉన్నాయి.

'ఇవి నేనిచ్చిన గింజలు కావు. ఏం జరిగింది? నిజం చెప్పెయ్యండి!' అని దండపాణి పెద్దకోడళ్ల నడిగాడు. వారు

గత్యంతరం లేక చేసిన పని చెప్పివేశారు. దండపాణి కడసారి కోడలు రోహిణితో, 'ఏవమ్మా నేను నిన్ను దాచమని ఇచ్చిన గింజలూ?' అని అడిగాడు.

'వాటిని మా పుట్టింటికి పంపాను. రావడానికి వ్యవధి కావాలి. రెండు రోజులు గడువివ్వండి,' అన్నది రోహిణి. సరేనన్నాడు దండపాణి. రెండు రోజుల కల్లా రోహిణి పుట్టింటివారి ఊరునుంచి యాభై బళ్లమీద ధాన్యపు బస్తాలు దిగాయి. వాటిని చూసి అందరూ నివ్వెర పోయారు. అయిదేళ్ల క్రితం అయిదు గింజలను సరిగా భద్రం చేయడం వల్ల యాభై బళ్ల ధాన్యం తయారయింది.

'గమనించావా? ఇంటిపెత్తనం నీ ఆఖరు కోడలు రోహిణికే ఇవ్వు. ఇంట్లో ఏ వస్తువును ఎలా భద్రం చేయాలో ఆమెకు బాగా తెలుసు,' అన్నాడు దండ పాణి తన భార్యతో.

'మిగిలిన ముగ్గురి మాట ఏమిటి? వారికి కూడా ఏదైనా పని చూపించ వద్దా?' అన్నది భద్రమ్మ.

ఉజ్జిక పనికిమాలిన వస్తువులు పార బోసే మనిషి. చెత్తా చెదారమూ ఊడ్చి ఇల్లు శుభ్రంగా ఉంచే పని ఆమెకివ్వు. భోగవతిది చేతికి దొరికిన వస్తువును అనుభవించే గుణం. ఆమెకు వంట ఇంటి పెత్తనం ఇవ్వటం మంచిది. రక్షిక ప్రతి వస్తువునూ జాగ్రత్తగా రక్షించగ లదు. కొట్టుపెత్తనం ఆమె చక్కగా నిర్వ హిస్తుంది. ఈ విధంగా పనులు విభజిం చినట్లయితే సంసారం సుఖంగా సాగిపో తుంది,' అన్నాడు దండపాణి.

భద్రమ్మ అలాగే తన కోడళ్లకు పనులు విభజించింది. ఇంటి పెత్తనం విరమించి ''కృష్ణా, రామా!'' అనుకుంటూ చీకూ చింతా లేకుండా మిగిలిన తన జీవిత కాలాన్ని సుఖంగా వెళ్లబుచ్చింది.






# కాళిదాసుతో పోటీ

అవంతిదేశంలో హేమచంద్రుడనే ఒక కవి ఉండేవాడు. అతను చాలా ధనికుడు. అతను కాళిదాసు పేరు ప్రతిష్టలూ, భోజ రాజు ఆస్థానంలో తనకున్న అగ్రస్థానం వంటి విషయాలు విన్నాడు. కాళిదాసును కవిత్వంలో ఓడించి, అతని స్థానం కాజెయ్యా లనే దుర్బుద్ధి హేమచంద్రుడికి కలిగింది.

ఈ ప్రయత్నంమీద హేమచంద్రుడు తన పల్లకీ ఎక్కి, కొంత పరివారాన్ని వెంట బెట్టుకుని ధారానగరం చేరి ఒక సత్రంలో బసచేశాడు. తనను ఓడించి తన స్థానం ఆక్రమించే ఉద్దేశంతో హేమచంద్రుడు వచ్చినట్లు కాళిదాసుకు తెలిసింది.

అతను ఈ హేమచంద్రుడి శక్తి ఏపాటిదో చూద్దామనే ఉద్దేశంతో బోయీ వేషం వేసు కుని హేమచంద్రుడి బసముందున్న బోయీలలో చేరాడు. కొద్ది సేపట్లో హేమ చంద్రుడు ఇంటి బయటికి వచ్చి, 'ఒరే, బోయీలూ!' అని కేకపెట్టాడు.

మిగిలినవాళ్లతోబాటు కాళిదాసు కూడా ముందుకువచ్చాడు. హేమ చంద్రుడు పల్లకిలో ఎక్కి కూచోగానే ముందువైపు ఇద్దరు బోయీలూ, వెనుకవైపున ఇద్దరు బోయీలూ పట్టి పల్లకీ ఎత్తారు. ముందున్న ఇద్దరిలో ఒకడు కాళిదాసు. పల్లకి సాగిపో తున్నది. పల్లకీమోత కొంచెమైనా అలవాటు లేని కాళిదాసు మాటిమాటికీ భుజం మార్చుకోసాగాడు.

ఇది గమనించి హేమచంద్రుడు,

'అయ మాన్దోలికా దండః స్కంధం కిం తవ బాధతి?' (పల్లకీ బొంగు నీ భుజాన్ని బాధిస్తున్నదా ఏం?) అని అడిగాడు.

ఆర్ విశ్వేశ్వర శాస్త్రి

హేమచంద్రుడు అన్న మాటల్లో ఒక వ్యాకరణ దోషం ఉంది. 'బాధతే' అనవల సినదానికి అతను 'బాధతి' అన్నాడు. ఈ అపశబ్దం విని కాళిదాసు మండిపోయి,

'న బాధతే తథా మాం హియథా బాధతి బాధతే,' (నీవు ప్రయోగించిన బాధతి బాధిం చినంతగా నన్నది బాధించడం లేదు) అని ఎత్తిపొడిచాడు.

బోయీకి ఇంత పాండిత్యం ఉన్నదా? అని హేమచంద్రుడికి ఆశ్చర్యం కలిగి, 'ఏమోయ్? నీకింత భాషా జ్ఞానం ఎలా కలిగింది?' అని కాళిదాసును అడిగాడు.

'అయ్యా, నేను కాళిదాసుగారి పల్లకీ మోస్తుంటాను. ఆయన శిష్యులకు పాఠాలు చెప్పేటప్పుడు నాలుగు ముక్కలు నా చెవినపడతాయే గాని, నాకు భాషాజ్ఞానం ఏమీ లేదు,' అన్నాడు కాళిదాసు.

కాళిదాసు పల్లకీ మోసేవాడికే ఇంత పాండిత్యం ఉంటే కాళిదాసుకెంత ఉండాలి? అనుకుని హేమచంద్రుడు కాళిదాసును స్వయంగా చూడటానికి బయలుదేరాడు.

హేమచంద్రుడు తన ఇంటికి వస్తున్నాడని తెలిసి కాళిదాసు ఒక నౌకరు వేషం వేసుకుని తలవాకిలి వద్ద నిలబడ్డాడు. హేమచంద్రుడు 'కాళిదాసుగారున్నారా?' అని అడిగాడు. వెంటనే కాళిదాసు,

'నఖ లీన ఖలీన లీలయా సమయ న్నున్నమయన్నవం హయం నిరగా దుర గారి రంహసా పుర గారుత్మత గోపురా ద్బహిః' (కొత్త గుర్రం ఎక్కి, చేతిలో కళ్లెం పట్టుకుని లాగుతూ, వదులుతూ గరు త్మంతుడి వేగంతో, పట్టణంలోని పచ్చల గోపురం దాటి బయటికి వెళ్లాడు) అని చెప్పాడు. 'కాళిదాసు వాకిట కాపలా కాసే వాడే ఇంత కవి అయితే, కాళిదాసును మనం ఓడించేదేమిటి?' అనుకుని హేమ చంద్రుడు ఆనాడే అవంతీ నగరానికి వెళ్లి పోయాడు.






# సూది తెచ్చిన సౌభాగ్యం

కోసల దేశంలో ముగ్గురు మిత్రులుండే వారు. వారిలో నందుడు, సునందుడు అనేవారు ధనికులు. మూడవవాడు ఆనందుడు గర్భదరిద్రుడు. అతను తాళ్లు పేనుకుని జీవించేవాడు. అతణ్ణి ఏ విధంగానైనా ధనికుణ్ణి చెయ్యాలని నందుడూ, సునందుడూ ఆలోచన చేశారు.

'పెట్టుబడికి కొంత ధనం ఉన్నట్లయితే ఎవరైనా ధనికుడు కావచ్చు. కనుక ఆనందుడికి కొంత మూలధనం ఇద్దాం,' అన్నాడు నందుడు.

'ఎంతమంది ధనికులు దరిద్రులై పోవడం లేదు? కలిసి వచ్చినట్లయితే పెద్ద పెట్టుబడి లేకుండానే ధనికుడైపో వచ్చు,' అన్నాడు సునందుడు.

తనమాట నిజమని రుజువు చేయటానికని నందుడు ఆ మరునాడు ఆనందుడికి రెండు వందల మాడలిచ్చాడు. వాటితో ఏదైనా వ్యాపారం చేసుకుని ధనం సంపాదించమని చెప్పాడు. ఆనందుడు సంతోషించి, ఆ రెండు వందల మాడలలో పది ఖర్చుకు గాను తీసి, మిగిలినవి తన తలపాగాలోనే భద్రంగా మూటగట్టి, ఇంటి వెచ్చాలు కొనటానికి సంతకు బయలుదేరాడు. దురదృష్ట వశాత్తూ దారిలో ఒక పక్షి ఎటునుంచో వచ్చి, ఆనందుడి తలపాగాలో మూట చూసి అందులో ఏదో ఉన్నదనుకుని తన్నుకుపోయింది. నూట తొంభైమాడలూ రెక్కలు వచ్చి ఎగిరిపోయినందుకు ఆనందుడు చాలా విచారించాడు.

బి.శివన్నారాయణ

తరువాత కొద్ది రోజులకు నంద సునందులు ఆనందుడి ఇంటికి వచ్చి, తమ స్నేహితుడి పరిస్థితిలో మార్పు లేనందుకు కారణం అడిగారు. 'నా అదృష్టం బాగులేదు. డబ్బంతా తలపాగాలో చుట్టుకున్నాను. కాని ఏదో పక్షి వచ్చి తన్నుకుపోయింది,' అన్నాడు ఆనందుడు విచారంగా.

ఈ వృత్తాంతం నందుడు నమ్మాడు గాని, సునందుడు నమ్మలేదు. ఆనందుడా డబ్బును దుర్వినియోగపరిచి ఉంటాడనుకున్నాడు. నందుడు మాత్రం ఆనందుడికి మరొకసారి రెండువందల మాడలిచ్చి, 'ఈసారి అయినా డబ్బు కాస్త భద్రంగా ఉంచుకుని, దాని సహాయంతో ధనం సంపాదించు,' అని సలహా ఇచ్చాడు.

ఈసారి ఆనందుడు తనకు కావలసిన మాడలు తీసుకుని, మిగిలినవి తవుడుతట్ట అడుగున భద్రంగా దాచి, ఇంటికి కావలసిన సంబారాలు పట్టుకువద్దామని మళ్ళీ సంతకు వెళ్లాడు. అతను తిరిగి వచ్చేసరికి తవుడు తట్ట కనపడలేదు. భార్యనడిగాడు.

'ఉప్పు అమ్మకానికి వచ్చింది. దగ్గిర డబ్బులు లేవు. అందుకని తవుడు తట్ట అమ్మిరెండు శేర్లు ఉప్పు తీసుకున్నాను,' అన్నది ఆనందుడి భార్య. ఆనందుడికి పట్టరాని దుఃఖం కలిగింది. తనకు జీవి




తంలో డబ్బు దక్కించుకునే యోగం లేదని అతను తేల్చుకున్నాడు.

మరి కొద్దిరోజుల తర్వాత నందసునందులు మళ్లీ అక్కడికి వచ్చి జరిగిన సంగతి విన్నారు. ఆనందుడు ఎప్పటి కన్న దరిద్రుడిగా కనిపించాడు. అతడు బట్టల చిరుగులు కూడా కుట్టుకోలేదు. కారణమేమంటే ఇంట్లో సూది కూడా లేదని చెప్పాడు.

అప్పుడే బజారులో సూదుల పొట్లం కొన్న సునందుడు ఆనందుడికి ఒక సూది ఇచ్చి, 'దీన్ని ఉపయోగించి నీ భార్య చేత చిరుగులు కుట్టించుకో!' అన్నాడు. తరువాత నందసునందులు వెళ్ళిపోయారు.

ఆ రోజు రాత్రే పక్క ఇంటి బెస్తవాడి భార్య ఆనందుడి భార్యవద్దకు వచ్చి, 'అక్కా, మీ ఇంట్లో సూది ఉంటే కాస్త ఇస్తావా? రేపు ఉదయమే మావాళ్లు వలలు పట్టుకుని చేపలు పట్టబోతున్నారు. వల బాగు చేసుకోవాలి. వలలో మొదట పడిన చేపలు మీకిస్తాంలే!' అన్నది.

ఆనందుడి భార్య ఆమెకు ఇంట్లో ఉన్న సూది అరువు ఇచ్చింది. మర్నాడు సాయంకాలం చేపలతో తిరిగి వచ్చిన బెస్తవాడు ఆనందుడి ఇంటికి ఒక పెద్ద చేపను పంపాడు. కూర వండుదామని ఆనందుడి భార్య ఆ చేపను కోసేసరికి అందులో ఒక పెద్ద గాజుముద్దలాటిది దొరికింది. ఆ గాజుముద్దతో ఆనందుడి పిల్లలు వీధిలో ఆడుతుండగా చూసిన నగల వర్తకుడు ఉన్నఫళాన ఆనందుడి దగ్గిరికి వచ్చి, 'ఆ గాజుముక్క నాకు అమ్ముతావా, ఆనందయ్యా? నూరు మాడలిస్తాను!' అని అడిగాడు.

అది చాలా విలువైన గాజుపెంక అయి ఉండాలని అనుమానం తగిలి ఆనందుడు దానిని అమ్మేందుకు నిరాకరించాడు. ఆరోజే దానిని నగరానికి పట్టుకుపోయి రత్నాల వర్తకులకు చూపించాడు. నిజానికి అదొక అమూల్యమైన వజ్రం. దానిని పెద్ద వర్తకుడు ఇరవైవేల మాడలిచ్చి కొనుక్కున్నాడు. ఆ ధనంతో ఆనందుడు ఇళ్లూ, దొడ్లూ కొన్నాడు. తాళ్లు పేనటానికి కర్రలతో యంత్రాలు చేయించాడు, తాళ్లపరిశ్రమ ఏర్పాటు చేశాడు, ధనికుడైనాడు.



ఆనందుడు అకస్మాత్తుగా ధనికుడైన వార్త తెలియగానే అతని మిత్రులు నందసునందులు అతనిని చూడవచ్చారు.

'నేనిచ్చిన డబ్బు పెట్టుబడి పెట్టి నీవు ధనికుడవయావు. అవునా?' అన్నాడు నందుడు. ఆనందుడు జరిగినదంతా పూసగుచ్చినట్టు మిత్రులకు చెప్పాడు.

'కాలం కలిసి వచ్చేసరికి నేనిచ్చిన సూదితోనే ఆనందుడు ధనం సంపాదించాడు, చూశావా?' అన్నాడు సునందుడు. ఈసారి నందుడికి నమ్మకం కలగలేదు. ఆనందుడు తన ధనంతోనే ధనికుడై, ఆ సంగతి కప్పిపుచ్చటానికి అబద్ధమాడుతున్నాడనుకున్నాడు.

మిత్రులు ముగ్గురూ కలిసి ఆనందుడు కొత్తగా కట్టించిన ఇల్లూ, వెనక ఉన్న దొడ్డీ చూడటానికి బయలు దేరారు. వారు దొడ్లోకి వెళ్లేసరికి ఆనందుడి పిల్లలు ఒక చెట్టు ఎక్కి దానిమీద ఉన్న పక్షిగూడు కింద పడేశారు. అందులో ఆనందుడి తలపాగా కనిపించింది. దాని చెంగున మూటకట్టి ఉన్న నూట తొంభై మాడలూ దొరికాయి.

వారక్కడినుండి బయలుదేరి గొడ్ల సావిడికి వచ్చారు. అదే సమయంలో బజారు నుంచి నౌకరు ఒకడు తవుడు తట్ట కొని తెచ్చాడు. వాడు దానిలోనుంచి తవుడు తీసి కుడితిలో పోస్తూండగా బంగారు మాడలు కొన్ని వాడి చేతిలోకి వచ్చాయి. తట్ట బోర్లించి చూసేసరికి ఆనందుడు రెండవసారి పోగొట్టుకున్న నూట తొంభై మాడలూ కూడా దొరికాయి!

ఇది చూడగానే నందుడికి ఆనందుడి మాటలలో నమ్మకం కుదిరింది. సునందుడు చెప్పినట్లు కలిసివస్తే ఐశ్వర్యం రావటానికి కుట్టుసూది అయినా చాలునని నందుడు గ్రహించాడు.





# రైతే రాజు

రంగస్వామిది వ్యవసాయ కుటుంబం. పిత్రార్జితంగా వచ్చిన పదెకరాల పొలం సాగు చేసుకుంటూ జీవనం సాగిస్తుండేవాడు. ఇప్పు డొక సమస్య వచ్చిపడింది. ఎదుగుతున్న పిల్లలు మంచి చదువు కోసం పట్నం పోదా మని ఒత్తిడి చేస్తున్నారు. అందుకు భార్య సుగుణ కూడా వత్తాసు పలికింది.

సేద్యంపై మమకారం విడిచిపెట్టుకోలేక పిల్లల కోరిక కాదనలేక మథనపడుతుండే వాడు. చివరకు మంచి సలహా కోసం బాల్య మిత్రుడు తోటి రైతు సుబ్బరాజును కలవ డానికి బయలుదేరాడు.

రంగస్వామిని సుబ్బరాజు సాదరంగా ఆహ్వానించాడు. అతడిని కూర్చుండబెట్టి వంటగదికి వెళ్ళి ఓ లోటాతో మజ్జిగను తెచ్చి రంగస్వామికి ఇచ్చాడు. రంగస్వామి మజ్జిగ త్రాగి ''ఇంట్లో ఎవరూ కనిపించడం లేదు. చుట్టాలింటికి వెళ్ళారా?'' అడిగాడు.

''చదువుల కోసం పట్నం వెళ్ళారు?'' సమాధానమిచ్చాడు సుబ్బరాజు.

''పిల్లలంటే చదువుల కోసం వెళ్ళారు. మరి నీ భార్య?'' ప్రశించాడు రంగస్వామి.

''పట్నంలో పిల్లలకు తోడుగా పంపిం చాను. పాడి, పంటను విడిచిపెట్టుకోలేక నేను ఇక్కడ ఒంటరిగా ఉంటున్నాను'' అన్నాడు సుబ్బరాజు.

''నేను సలహా కోసం వచ్చాను. యధా ర్థాన్ని చూశాను. ఒంటరిగా వ్యవసాయం చేయగలమా?'' అడిగాడు రంగస్వామి.

''నీ పిల్లలు పట్నం చదువుల కోసం పట్టు బడుతున్నారా?'' అడిగాడు సుబ్బరాజు.

''అవును. ఈ మధ్య సమయానికి విత్త నాలు దొరకక పడ్డ అవస్థలు. దున్నడానికి, ఉడుపులకు, కోతలకు కూలీలు పెడుతున్న పాట్లు అన్నీ చూసి సేద్యం కన్నా చదువుకొని ఉద్యోగం సంపాదించుకోవడమే మంచిదన్న

బి.వి. పట్నాయక్

అభిప్రాయానికి వచ్చారు. వారు అందుకే పట్నం చదువుకు సిద్ధమయ్యారు. నీ సలహా కోసం వచ్చాను'' చెప్పాడు రంగస్వామి.

''చదువులు ఉండాలి కాని, వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేస్తే జీవి మనుగడే కష్టం. అందుకోసమే అక్కడ వాళ్ళని చదివిస్తున్నాను. ఇక్కడ నేనుండి వ్యవసాయం చూసుకుంటున్నాను'' చెప్పాడు సుబ్బరాజు.

ఇంతలో పొరుగింటి నుండి పోలిరాజు వచ్చాడు. ''చూశావు అన్నా! రైతుకు అన్నీ కష్టాలే! కిందటేడు పండిన పంటను దాచి ఉంచాను. ఈ రోజు వరకు సరైన ధర పలక లేదు సరికదా! దాచి ఉంచినందుకు ఎలుకలు చేరి పందికొక్కుల్లా తయారయ్యాయి. ఈ నష్టంలో కొంత ధాన్యం కరిగిపోయింది. మన సమస్యలకు ఎవరూ స్పందించరు. తినే ప్రజలకు మన కష్టాలు అవసరం లేదు. పాలించే ప్రభువుకు కూడా మనమంటే చిన్న చూపే'' అంటూ కష్టాలను ఏకరువు పెట్టాడు.

''ఊరుకో అన్నా! మనకు మంచి రోజులు వస్తాయి. అలా నిరాశ పడకూడదు. మనం మహరాజులకే తిండి పెట్టే మహరాజులం. మనం లేకపోతే ప్రపంచానికి మెతుకు కూడా పుట్టదు'' సముదాయించాడు సుబ్బరాజు.

''అన్నా! రేపు ఈ ధాన్యం అమ్మినా అప్పులు తీరవు, అందుకే భూమి అమ్మి అప్పులన్నీ తీర్చి పట్నంలో కూలీ, నాలీ చేసుకోవాలన్పిస్తుంది'' అన్నాడు పోలిరాజు.

''నీది సరైన నిర్ణయం కాదేమో. ప్రజలు, ప్రభువు మీద కోపంతో భూమిని దూరం చేసుకోవడం తెలివితక్కువతనం. ధాన్యానికి సరైన ధర వచ్చేవరకు పోరాటం చేస్తే ఫలితం ఉంటుంది. నీ వెనుక మేమంతా ఉన్నాం.




ఊరకే అధైర్యపడకు'' అంటూ ధైర్యాన్ని నూరిపోసాడు సుబ్బరాజు.

''సుబ్బన్నా! ఈ తరం పిల్లలంతా ఉద్యోగ వ్యామోహంలో వ్యవసాయాన్ని నామోషీగా చూస్తున్నారు. ఇది కూడా తిండిపెట్టే ఉద్యోగమేనని వారు గ్రహించకుంటున్నారు. ఈ మధ్య కాలంలో వ్యవసాయం కష్టనష్టాలు చూస్తుంటే పిల్లలు తీసుకొనే నిర్ణయమే సబబనిపిస్తుంది'' తన మనసులో మాటను బయటపెట్టాడు రంగస్వామి.

అందరూ చేరి వ్యవసాయంలో కష్టాలు చెప్పుకోవడంతో సుబ్బరాజు బాధపడ్డాడు. రైతును రాజుగా చూసే రోజు రావాలని మనసులో అనుకొని పరిష్కారం కోసం ఆలోచన చేయడం మొదలు పెట్టాడు.

''మిత్రులారా! కష్టాలు, నష్టాలు అనుకుంటూ మథనపడితే అవి పదిరెట్లు పెరుగు



తూనే ఉంటాయి. వాటిని ధైర్యంగా ఎదుర్కొంటే ఒక్కొక్కటిగా దూరమవుతాయి. ఓర్పు ఉంటే ఎంతటి సమస్యనైనా పరిష్కరించవచ్చు. నేనొక పథకం ఆలోచించాను. దాంతో మనకు పూర్వ వైభవం వస్తుంది. దానికి మీ సహకారం కావాలి. నేను చేయబోయే పాదయాత్రకు తోడు రావాలి. ప్రతి రైతును కలవాలి'' అంటూ తన పథకాన్ని అందరికి రహస్యంగా చెప్పాడు సుబ్బరాజు. అందరూ అంగీకరించారు.

అనుకున్న ప్రకారం అందరూ తమ పనులను వాయిదా వేసుకొని ఓర్పుతో సుబ్బరాజు వెంట పాదయాత్రకు వెళ్ళారు. రాజ్యమంతా తిరిగారు. ప్రతి రైతును కలిశారు.

కొన్నాళ్లకు వర్షాకాలం వచ్చింది. అందరూ పంటలు వేసారు. ఆరుమాసాల్లో పంటలు చేతికి వచ్చాయి. ఆ సంవత్సరం పండిన పంటలు గురించి రాజు ఆరా తీశాడు.

ఆహార ధాన్యాల ఉత్పత్తి గణనీయంగా పడిపోయిందని నివేదికలు వచ్చాయి. ఆహార భద్రత లేని రాజ్యంలో ప్రజలు ఉండడానికి ఇష్టపడరు. ప్రజలంతా వలసలు వెళ్ళిపోతే రాజ్యాభివృద్ధి ఒక్కసారిగా కుంటుపడిపోతుందని ఊహించిన రాజు రైతులతో ప్రత్యేక సమావేశానికి ఏర్పాట్లు చేశాడు. భూమి సాగు చేయకుండా ఎందుకు ఎండబెట్టారని రాజు రైతుల్ని ప్రశ్నించారు.

''రాజ్యంలో ఆహార ధాన్యాల దిగుబడి తగ్గిపోయింది. వర్షాలు కురిసాయి. ప్రభుత్వపరంగా అన్ని వసతులు కల్పించాం అయితే మీరు మటుకు మీ కుటుంబాలకు సరిపోయే ధాన్యాన్ని పండించుకుని మిగతా భూమిని సాగు చేయకుండా విడిచిపెట్టారు. మీ వలన రాజ్యంలో ఆహార ధాన్యాల కొరత ఏర్పడింది. ప్రజలు ఏమి తిని బ్రతుకుతారనుకుంటున్నారు? అందరూ కలసి కష్టపడితేనే దేశాభివృద్ధి జరుగుతుంది. మిమ్మల్ని దేశద్రోహం నేరం కింద ఖైదు చేయించినా తప్పులేదు'' ఆవేశంగా అన్నాడు రాజు.

''ప్రభూ! ఈ సమయంలో ఆవేశపడే కన్నా ఆలోచన చేయడం మంచిది. ఇలా రైతులు ఎందుకు చేశారో అడిగారా?'' ధైర్యంగా ప్రశ్నించాడు సుబ్బరాజు.

అప్పుడు రాజు ఆలోచనలో పడ్డాడు ''మేలు చేసిన ప్రభుత్వంపై కక్ష సాధించాలనుకుంటున్నారా?'' అంటూ ఒక మెట్టు కిందకు దిగాడు.

''ఎదుటి వాడికి చేసిన సాయమే వ్యవసాయం. మా కష్టానికి తగ్గ ఫలితం ఉన్నా, లేకపోయినా ఎదుటివారికి తిండి గింజలు అందించడమే మాకు తెలుసు. సాయం చేసే

చేతులకు కక్ష సాధింపులు తెలియవు. రైతు రాజ్యానికి శ్రీరామరక్ష. అటువంటి రైతును నిర్లక్ష్యం చేస్తున్నారు. అభివృద్ధి అంటూ అన్ని రంగాలను ప్రోత్సహిస్తున్నారు. ఒక్క వ్యవసాయ రంగాన్ని తప్ప. అందుకే సమాజానికి రైతంటే చిన్నచూపు ఏర్పడింది.

చివరికి మా పిల్లల పెళ్ళిళ్ళకు కూడా ఈ వ్యవసాయమే అడ్డంకిగా నిలుస్తుంది. మాకే విలువ లేనప్పుడు మేము ఎవరి గురించి కష్టపడాలి? మేమంటే ఏమిటో తెలియజేయడానికి ప్రతి రైతు కూడా తమ కుటుంబాలకు సరిపోయే ఆహార ధాన్యాలు మాత్రమే పండించి నిరసన తెలియజేశారు'' అంటూ వివరించాడు సుబ్బరాజు.

''సమాజంలో రైతు స్థానాన్ని పదిలపరచవల్సిన అవసరం గుర్తించాను. ఇంతవరకు జరిగిన అనాలోచిత నిర్ణయాలను ఉపసంహరించుకుంటాను. రైతు కన్నెర్ర జేస్తే ఎంత నష్టమో ఇప్పుడు తెలుసుకున్నాను. తిండి గింజలుంటేనే ప్రజలంతా బాగుంటారు. మీరు బాగుంటేనే ప్రజలకు తిండిగింజలు చేరుతాయి. ఇక నుండి ఉద్యోగి మాదిరి ప్రతి రైతుకు ప్రోత్సాహక జీతం ఇచ్చే చట్టాన్ని రూపొందిస్తాను. రైతులు పండించే ప్రతి ధాన్యం గింజ ప్రభుత్వమే కొనుగోలు చేసేందుకు చర్యలు తీసుకుంటాను ఇక రైతే రాజు'' అని ప్రకటించాడు రాజు.

సుబ్బరాజు నిరసన పథకం ఫలించినందుకు రైతులంతా సంతోషంతో జేజేలు పలికారు. కలసికట్టుగా ఉండి ఓర్పుతో వ్యవహరించినందుకే వ్యవసాయం పండుగైందని తెలుసుకున్నారు. రైతుల సమస్యలు ఒక్కొక్కటిగా పరిష్కారం కావడం మొదలైంది.

భారతీయ ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయానికి గౌరవం లేదు. ఆంధ్రప్రదేశ్‌లోని తీరప్రాంత రైతులు ఒక పూర్తి పంట కాలంలో లక్షలాది ఎకరాల్లో పంటలు వేయకుండా సెలవు ప్రకటించారు. విత్తనాలు, ఎరువులు పంపిణీ చేయకపోవడం. దళారుల జోక్యం పంటలకు గిట్టుబాటు ధరలలేమి, పెరిగిన సేద్యపు ఖర్చులు వీటికి కారణం. విసిగిపోయిన రైతులు తాము ఐక్యంగా నిలబడి పంటలకు విరామం ప్రకటించారు. ప్రభుత్వం వారితో చర్చలకు దిగినప్పటికీ పంటలు వేసే అదును తప్పిపోయింది. ఈ విషాద పరిస్థితికి చలించిపోయిన నేపథ్యంలో ఈ కథ పుట్టింది.



# ప్రత్యక్షసాక్ష్యం

ఒకనాడు కొందరు ఒకచోట చేరి తమ మిత్రుడు, మరొకడి మంచిచెడ్డలను గురించి ముచ్చటించుకుంటున్నారు.

చాలామంది అతని మంచిగుణాలను గురించి పొగిడిన మీదట ఒక మిత్రుడు, 'మనవాడు అన్నివిధాలా మంచివాడే, సందేహం లేదు. వాడికి రెండే అవలక్షణా లున్నాయి!' అన్నాడు.

'ఏమిటవి?' అని అడిగారు మిగిలినవాళ్లు.

'ఒకటి దురాగ్రహమూ, రెండు దుస్సాహసమూనూ!' అన్నాడు మిత్రుడు.

అప్పుడే అక్కడికి వస్తున్న అ వ్యక్తి తనను గురించి ఈ విమర్శ వింటూనే గబాగబా వచ్చి విమర్శించిన వాడి గొంతు పట్టుకుని, 'బుద్రతక్కువ వెధవా! నాకు దురాగ్రహమంటావా? గొంతు పిసికిపారేస్తాను! ఏమిటనుకున్నావో!' అని చంపబోయినంత పనిచేశాడు.

మిగిలిన స్నేహితులు అతడిని విడిపించి, 'నీకు దురాగ్రహమూ, దుస్సహ నమూ ఉన్నట్లు నువ్వే రుజువుచేసుకున్నావులే!' అని హేళన చేశారు.



# అట్టమీది బొమ్మ



డిసెంబర్ సంచికలో మీరు చూస్తున్న ఈ అద్భుతమైన వర్ణచిత్రం యులిసెస్ సాహసగాథల ప్రామాణిక సీరియల్ కోసం వేసిన కళాచిత్రాలలోనివి. చందమామ ప్రియతమ చిత్రకారులు శ్రీ చిత్రా వేసిన చిత్రమిది.

కంప్యూటర్ యుగం ఉనికిలో లేని కాలంలో చిత్రా గారు ఈ చిత్రంలో వేసిన నీలి, అరుణ వర్ణ చ్ఛాయలు ఈ కథ గాఢతను పరిచయం చేయడమే కాదు.. కథా నాయకుడు యులెసిస్ ఎదుర్కొంటున్న ప్రమాద తీవ్రత స్థాయిని కూడా పరమాద్భుత రీతిలో వివరిస్తున్నాయి. కథ, చిత్రం ఇందులో ఎంత బాగా ఇమిడిపోయాయంటే, ఈ రెండూ పరస్పరం సౌందర్యాత్మకంగా ప్రశంసించుకుం టున్నట్లు కనిపిస్తున్నాయి.

ఈ సీరియల్ చందమామలో1957-58లో ప్రచురించబడింది. ''సిరెన్స్ పిలుపు''ను ప్రతిబింబిస్తున్న ఈ చిత్ర దృశ్యం గ్రీకు గాథలోని ఒక దృశ్యం. ఈ కథలో కథానాయకుడు యులిసిస్ ఇంటిపై బెంగ పెట్టుకుని ఉంటాడు. అతడిని ప్రేమించిన మంత్రగత్తె సిర్సె అతడిని విముక్తి చేయాలని నిశ్చయించుకుంటుంది. తిరుగుప్రయాణంలో అతడు ఎదుర్కొనే ప్రమాదాలను గురించి ఆమె అతడిని హెచ్చరిస్తుంది.

సిరెన్ మహిళలు అతీత శక్తులు కలిగిన ప్రమాదకర వ్యక్తులు. వీళ్లు ప్రజలు తమ ద్వీపానికి వచ్చేలా ఆకర్షిస్తారు. వారు పాడే పాటను వినే ఏ వ్యక్తి అయినా ప్రతిఘటన అనేది లేకుండా ద్వీపంలోకి అడుగెడతారు. అక్కడినుంచి వెనుదిరగటం అసాధ్యం. అలాంటి వశీకరణ శక్తుల నుంచి యులెసిస్, అతడి సిబ్బంది ఎలా తప్పించుకుంటార నేది కథను మలుపు తిప్పుతుంది. ఈ సందర్భాన్ని తెలిపే క్రమంలో ఈ ప్రత్యేక వర్ణ చిత్రం రూపొందింది.

ఈ మంత్రశక్తులు జీవితంలో మనం ఎదుర్కొనే చెడుగుణాల లాంటివని మా బృంద సభ్యులలో ఒకరు ఇటీవలే వ్యాఖ్యానించారు. నిజంగానే చెడు అలవాట్లు మన జీవితం లోకి జొరబడుతున్నాయి. అవి మనను ఆకర్షించి, మన మనస్సులను ఆక్రమిస్తున్నాయి. వీటిని ప్రతిఘటించడానికి మనం నిత్య పోరాటం చేస్తుండాలి. యులిసెస్ లాగా మనం వీటిని ఎలా ప్రతిఘటిస్తామన్నది మన స్వంత గాథే అవుతుంది మరి.

ఈ అద్భుత వర్ణచిత్రాన్ని మీరు ఆస్వాదిస్తారని ఆశిస్తున్నాము. నూతన సంవత్సరం జనవరి మాసంలో మీ అందరికోసం మరొక అద్భుత ముఖచిత్రాన్ని తీసుకురాబోతున్నం దుకు సంతోషిస్తున్నాము.

– సౌమ్యా భరద్వాజ్

# నిజమైన నిధి

కంచిపేట గ్రామంలో కబీరుదాసు అనే గురువు వద్ద కొంతమంది శిష్యులు విద్యాభ్యాసం చేస్తుండేవారు. ఒకరోజు గురువుగారు శిష్యగణాన్ని పిలిచి వారికెదురుగా ఆహారం, ఉద్యోగం, విద్య అనే చీటీలు గల మూడు పెట్టెల్ని ఉంచాడు. ఆయా పెట్టెల్లోంచి తలా ఒక చీటీ తీసుకొమ్మని ఆదేశించాడు. శిష్యులందరూ పెట్టెల చుట్టూ మూగి తమకు నచ్చిన చీటీలు తీసుకున్నారు. కబీరుదాసు శిష్యులందర్నీ చీటీలవారీగా మూడు జట్లుగా విడివడమని చెప్పాడు. 'ఆహారం' జట్టులో అధికంగానూ, 'ఉద్యోగం' జట్టులో అంతకంటే కొద్దిగా తక్కువ మంది ఉండగా చిత్రంగా 'విద్య' జట్టులో మేధాంశుడు ఒక్కడే ఉండటం గమనించాడు.

మేధాంశునితో 'విద్య'ని ఎన్నుకోవడానికి కారణం అడగ్గా అతడు ''మీలో 'ఆహారం' ఎన్నుకున్న వారికి కేవలం ఆహారం మాత్రమే దొరుకుతుంది. 'ఉద్యోగం' ఎంపిక చేసుకున్నవారికి కొలువు తద్వారా ఆహారం దొరుకుతాయి. కానీ 'విద్య' ద్వారా నాకు ఉద్యోగం, తత్ఫలితంగా ఆహారమూ ఇలా మూడూ లభించే అవకాశముంటుంది,'' అని చెప్పాడు.

ఈ సమాధానంతో సంతృప్తి చెందిన కబీరుదాసు తతిమా శిష్యులనుద్దేశించి, 'చిత్తశుద్ధి లేని విద్యాభ్యాసం ఎందుకూ పనికిరాదు. విద్య కోసం వచ్చిన మీరు తొలి ప్రాధాన్యత విద్యకే ఇవ్వాలి. మిగిలినవన్నీ విద్యద్వారా సమకూరుతాయి. అంతెందుకు ఆ పెట్టెల వంక చూడండి. 'ఆహారం' అన్న పెట్టె చుట్టూ అధిక సంఖ్యాకులు చేరడం వల్ల ఆ పెట్టె పూర్తిగా ఖాళీ అయిపోయి బాగా చిరిగింది. రెండో పెట్టె కూడా అందుకు తీసిపోని విధంగా ఉంది. ఇక ఎన్నటికీ తరగని నిధి వంటి 'విద్య' అన్న పెట్టెమాత్రం నిండుగా ఉంది. ఆహారం తిన్నాక త్వరగా అరిగిపోతుంది. ఉద్యోగం మీలో జవసత్వాలున్నంతవరకే నిర్వర్తించగలుగుతారు. కానీ నేర్చుకున్న విద్య మాత్రం మనతో పాటు చివరికంటా మిగిలిపోతుంది. అందుకే 'విద్యయే నిజమైన విత్తము' అంటూ శిష్యులకు కనువిప్పు కలిగించాడు. – ఎం. మురళీమోహన్





# శిథిలాలయం -21

*(శిఖిముఖి కామాఖ్య నగరం నుంచి, జాంగ్‌లా అనే ఒక ఇభ్యుజాతివాణ్ణి దారి చూపేందుకు వెంటబెట్టుకుని బ్రహ్మపుత్రా నదీలోయలకు బయలుదేరాడు. వాళ్లు ఒక మహారణ్యంలో ఉండగా జాంగ్‌లాను కొండ చిలువ పట్టుకున్నది. శిఖిముఖి దాన్ని చంపాడు. అది చూసిన అఘోరీలనే సన్యాసులు కొందరు అతడి మీదికి రాసాగారు. తరవాత --)*

తన మీదికి వచ్చే అఘోరీలను చూసి శిఖిముఖి, తనకు ఇక చావు తప్పదనుకున్నాడు. వాళ్లెంత క్రూరులో తన తండ్రి చెప్పగా లోగడ అతడు విని ఉన్నాడు. కాని, ఈ సమయంలో పారిపోవటం గాని, వాళ్లను ప్రాణబిక్ష కోరటం గాని అవమానకరంగా శిఖిముఖికి తోచింది. చావు తప్పని సరి అయితే, వాళ్ళను ప్రతిఘటించి పోరాడుతూ చావడమే మేలనుకున్నాడు.

శిఖిముఖి ఇలా ఆలోచించి కత్తి పైకెత్తి పెద్ద గొంతుతో, 'విక్రమకేసరీ! నువు మన అంగరక్షకులతో తక్షణం ఇక్కణ్ణించి పారిపో. నన్ను అఘోరీల దండు చుట్టుముట్టుతున్నది. నా రక్షణకు వచ్చి నువ్వూ అనవసరంగా చావటం ఎందుకు?' అని కేక పెట్టాడు.

శిఖిముఖి మాట ముగించే లోపలే, అఘోరీల్లో ఒకడు అతణ్ణి శూలంతో పొడవబోయాడు. శిఖిముఖి దాని దెబ్బ తప్పుకుని, ఆ అఘోరీని కత్తితో మెడమీద బలంగా కొట్టాడు. 'వాడు, మహాకాళా!' అని అరుస్తూ పక్కకు పడిపోయాడు. ఇంతలో అఘోరీల్లో ఒకడు, 'ఆగండి! వాణ్ణి చంపకండి. వాడు విక్రమకేసరి

దాసరి సుబ్రహ్మణ్యం




కాకుండా ఆయన్ని పారిపొమ్మన్నావు. ఇది చాలా వింతగా ఉన్నది! ఎవరివి నువ్వు? ఆ విక్రమకేసరి గురువు ఎక్కడ?' అని ప్రశ్నించాడు.

శిఖిముఖికి ఆ ప్రశ్నతో పరిస్థితి చాలా వరకు అర్థమైపోయింది. తాత విక్రమకేసరి చాలాకాలం పాటు అఘోరీలు ఉండే ప్రాంతాన నివసించినట్టు, అతడు వదిలి పోయిన తాళపత్రాల ద్వారా తెలుస్తున్నది. తను కేక పెట్టి పారిపొమ్మన్నది, ఆ విక్రమ కేసరి వీళ్లనుకుంటున్నారు.

విక్రమకేసరి తన సమీపానికి రాగానే, శిఖిముఖి అతణ్ణి తనను ప్రశ్నించిన అఘో రీకీ చూపుతూ, 'ఇతడే విక్రమకేసరి! ఈయన తాతగారైన విక్రమకేసరి మహారాజు కొన్నేళ్ల క్రితం ఈ ప్రాంతాలకే వచ్చారు. ఆయన ఏమైనదీ తెలియలేదు. ఆయన్ని వెతికేందుకే మేము శూరసేన దేశం నుంచి బయలుదేరి ఈ ప్రదేశానికి వచ్చాం,' అన్నాడు.

శిఖిముఖిని ప్రశ్నించిన అఘోరీ తతిమ్మా వాళ్లకు నాయకుడు. అతడు శిఖిముఖి ఇచ్చిన జవాబు వింటూనే, విక్రమకేసరి ముందుకు వచ్చి వంగి నమస్కరించి, 'విక్రమకేసరి గురువు పోలికలన్నీ నీలో ఉన్నవి. ఆయన మా అఘోరీలకు ఆపద సమయాల్లో సలహాలిచ్చి, దీర్ఘ రోగాలను మూలికా చికిత్సతో నయం చేసి ఎంతగానో సాయపడ్డాడు. ఆయన ఋణం తీర్చుకోలే

గురువు పేరు ఉచ్చరిస్తున్నాడు,' అని కేక పెట్టాడు. ఆ సమయానికి అక్కడికి మరి నలుగురు అఘోరీలు వచ్చారు. శిఖిముఖి కేక వింటూనే, పారిపోవటానికి మారుగా విక్రమకేసరీ, అజితుడూ, వీరభద్రుడూ కత్తులు దూసి అతడి రక్షణకు పరిగెత్తుకు వచ్చారు.

అఘోరీల్లో మొదట మాట్లాడిన వాడు చేతులు చాచి తన వాళ్ళను కొంచెం వెనక్కు పొమ్మని చెప్పి, శిఖిముఖితో, 'మీ కత్తులూ, ఈటెలూ వంటివి మా అఘోరీల ముందు ఎందుకూ కొరగావు. నేను నా అనుచరుల్ని వెనక్కు పొమ్మన్నది, మీకు భయపడి కాదు. ఇంతకు ముందు నువ్వు విక్రమ కేసరి గురువు పేరు తలిచావు. అంతే

నిది. కాని....' అంటూ శిఖిముఖి ముఖం లోకి గుచ్చిగుచ్చి చూస్తూ, 'ఇతడు చెప్పేది నాకేం అర్థం కావడం లేదు. విక్రమకేసరి గురువు ఇంకా బతికుంటాడని మీరెందుకు భావించారు? ఒకవేళ ఆయన బతికే ఉంటే మీ దేశానికి ఎప్పుడో తిరిగి వచ్చేవాడు కదా?' అన్నాడు.

'ఆయన ఇంకా సజీవుడే అన్న కొన్ని వదంతులు మేం విన్నాం. బ్రహ్మపుత్రానదీ లోయల్లోని ఒకానొక శిథిలాలయ ప్రాంతానికి ఆయన వెళ్లినట్టూ, తరవాత ఆయన జాడ తెలియకుండా పోయినట్టూ, మాకు లభించిన తాళపత్రాల ద్వారా మేము ఊహించాం,' అన్నాడు శిఖిముఖి.



'మీ ఊహ సరైనదే. విక్రమకేసరి గురువు ఇభ్యుజాతి వాళ్లు నివసించే లోయ ప్రాంతాలకు వెళ్ళాడు. తరువాత ఆయన జాడ మాకు తెలియలేదు. ఇభ్యులు ఆయన్ని చంపి ఉంటారని మేం అనుకోం. ఆ ప్రాంతాల ఆయన ఏదో భయంకర వ్యాధికి గురై మరణించి ఉంటాడని మా నమ్మకం' అన్నాడు అఘోరీల నాయకుడు.

'అదేదో ఇదమిద్ధంగా తేల్చుకోదలిచాము. కాని, మాకు ఒకానొక పూజారి నుంచే కాక, మీ అఘోరీలనుంచి కూడా ప్రమాదాలు తప్పనట్టున్నవి' అన్నాడు శిఖిముఖి.

ఆ మాటకు అఘోరీల నాయకుడు నవ్వి, 'మావాళ్ల నుంచి మీకు ఎలాంటి హానీ కలగకుండా, ఇదిగో ఈ రుద్రాక్షల దండ నీ ముంజేతికి కడుతున్నాను. ఆ పూజారి సంగతి నాకు తెలియదు. మీ జాగ్రత్తలో మీరుండండి. మీ దేశానికి తిరిగి పోయేలోపల మిమ్మల్ని ఈ మహారణ్యాల్లో ఎక్కడో ఒకసారి మేం తప్పక కలుసుకుంటాం. నాపేరు ఘోరచిత్తుడు,' అని చెప్పి, శిఖిముఖి చేతికి రుద్రాక్షల దండ కట్టి, చావుబతుకుల్లో ఉన్న తమ అనుచరుణ్ణి తన వాళ్ల చేత పట్టించుకుని అఘోరీల నాయకుడు వెళ్ళిపోయాడు.

శిఖిముఖి తామంతా దిగిన చెట్టు కిందికి వచ్చాడు. అజిత, వీరభద్రులు వంటపనిలో నిమగ్నులయారు. శిఖిముఖి, విక్రమకేసరిని దూరంగా తీసుకుపోయి, జాంగ్



చేశారు. ఆ సరికి జాంగ్‌లా ఒళ్లునొప్పులు పోయి, మామూలుగా నడవసాగాడు. చెట్టు కింద శిఖిముఖీ, విక్రమకేసరీ తన వెంట తెచ్చిన నారపట్టాలతో చిన్న గుడారం వేసుకుని, దానిలో పడుకున్నాడు. అజితుడూ, వీరభద్రుడూ, జాంగ్‌లా కంచర గాడిదలకు మేత వేసి, తాము దిగిన చోటుకు చుట్టూ అక్కడక్కడా నెగళ్లు వెలిగించారు. అప్పటికే జాము పొద్దు పోవడంతో తతిమ్మా, మూడు జాముల రాత్రిలోనూ, జాము కొకరు చొప్పున మేల్కొని ఉండి, కాపలా కాయటానికి ఏర్పాట్లు చేసుకున్నారు.

మొట్టమొదటి కాపలా వంతు అజితుడిది, అతడు నెగళ్లు ఆరిపోకుండా మధ్య మధ్య వాటి మీద ఎండుపుల్లలు వేస్తూ, చుట్టూ వున్న చీకట్లో నుంచి ఏవైనా మృగాలు గాని, శత్రువులు గాని వస్తున్నారేమో కనిపెట్టేందుకు గుచ్చి గుచ్చి చూడ సాగాడు. ఆ జాము కాలమూ ఎలాంటి దుర్ఘటనా లేకుండా గడిచిపోయింది. దూరంగా అరణ్యంలో పులి అరుపూ, నక్క కూతలూ మాత్రం అజితుడు విన్నాడు. మధ్యమధ్య ఏదో ఈలలాంటి ధ్వని కూడా అతడి చెవుల బడింది. బహుశా అది వెదురు పొదల్లో గాలి చేసే శబ్దం అయి ఉంటుందనుకున్నాడతను.

అజితుడివంతు అయిపోగానే, జాంగ్‌లా కాపలాకు పూనుకున్నాడు. అజితుడు

లాను కొండ చిలువ పట్టుకునే ముందు, తాను చెట్టు చాటున ఎవరో మాట్లాడుతున్న శబ్దం విన్న సంగతి చెప్పాడు.

'జాంగ్‌లాను ప్రశ్నించి నిజం తెలుసుకోవచ్చు కదా?' అన్నాడు విక్రమకేసరి.

'వాడు మనకు తెలియకుండా మరెవరితోనో చెట్ల చాటున మాట్లాడి ఉంటే మన ప్రశ్నలకు వాణ్ణుంచి నిజం బయటపడదు. ఒకవేళ నేనే పొరబడి ఉండవచ్చు. గాలికి చెట్ల ఆకులూ, చిరుకొమ్మలూ, చేసే శబ్దం కూడా ఒకోసారి ఎవరో గుసగుసలాడుతున్నట్లు ధ్వనించడం జరుగుతుంది. ఏమైనా మనం మరి కాస్త అప్రమత్తులుగా ఉండాలి' అన్నాడు శిఖిముఖి.

వంటపూర్తవగానే అందరు భోజనాలు

పోయి, వీరభద్రుడికి అంత ఎడంలో పడుకున్నాడు. కాని అతడికి నిద్ర సరిగా పట్టలేదు. అఘోరీల దాడి తరవాత అతడికి ఏ నిమిషాన ఎలాంటి ప్రమాదం వస్తుందో అన్న భయం పట్టుకున్నది.

కొద్ది కాలం గడిచింది. అజితుడు కొంచెం సేపు నిద్రతో జోగి, దూరాన్నుంచి ఏదో క్రూరజంతువు అరుపు వినబడగానే మత్తుగా కళ్లు తెరిచి చూశాడు. జాంగ్‌లా నెగళ్ల పక్కగా నిలబడి అరణ్యంలోకి చూస్తున్నాడు. వాడు సరిగా కట్టెలు వేయ నందున నెగళ్లు క్రమంగా ఆరిపోతున్నవి.

అజితుడు లేచి వాణ్ణి గట్టిగా కోప్పడ దామనుకున్నంతలో, చెట్ల చాటునుంచి సన్నని ఈల వినబడింది. ఆ వెంటనే జాంగ్‌లా ఈటె భుజాన పెట్టుకుని కూర్చు న్నాడు. ఏదో మోసం జరగబోతున్నదని అజితుడు అనుకుని నిశ్శబ్దంగా తల తిప్పి శిఖిముఖీ, విక్రమకేసరులు నిద్రపోతున్న గుడారం కేసి చూశాడు. ఆ సమయంలో అక్కడ కనిపించిన దృశ్యం అతణ్ణి నిలు వెల్లా కంపించేలా చేసింది.

చిరుతపులి ఒకటి గుడారాన్ని సమీ పించి, నేలను మూచూసి, గుడారం పట్టాల ఖాళీలోంచి లోపలికి తలపెట్టబోతున్నది. ఇంత జరుగుతుంటే ఎర్రగండు ఏం చేస్తు న్నట్టు? అనుకున్నాడు అజితుడు. అతడికి రానున్న ప్రమాదం అర్థం కాగానే, అంత వరకూ మనసులో ఉన్న భయం కాస్తా ఎగిరిపోయింది. 'వీరభద్రా, లే! ప్రమాదం ముంచుకు వస్తున్నది' అంటూ అతడు ఎగిరి లేచి చేతిలో ఉన్న ఈటెను గురిచూసి



చిరుత పులికేసి విసిరాడు. అదృష్టం కొద్దీ ఆ ఈటె సూటిగా పోయి చిరుతపులి రొమ్ముల్లో గుచ్చుకున్నది. బాధతో అది పెద్దగా బొబ్బరిస్తూ, పడుతూ లేస్తూ దూరంగా ఉన్న పొదల కేసి పోసాగింది.

అజితుడి కేకలూ, చిరుతపులి బొబ్బ రింతల్తో శిఖిముఖీ, విక్రమకేసరీ నిద్రలేచి కత్తులు దూస్తూ గుడారం నుంచి బయ టికి వచ్చారు. ఈలోగా అజితుడు, నిద్ర లేచిన వీరభద్రుడితో, జాంగ్లా పారిపో కుండా చూస్తుండమని చెప్పి, శిఖిముఖీ వాళ్ల దగ్గరకు పరుగెత్తి పోయి, జరిగిం దేమిటో చెప్పి, 'ఆ పొదల చాటునుంచి ఈల వినిపించింది. అక్కడెవడో దాగివున్నా డని నా అనుమానం,' అన్నాడు.



విక్రమకేసరి ఆ మాట వింటూనే, విల్లు తీసుకుని బాణం ఎక్కుపెట్టి, అజితుడు చూసిన పొదల కేసి వరుసగా మూడు బాణాలు కొట్టాడు. మూడో బాణం జుయ్ మంటూ పోయి ఒకపొదను తాకేసరికి, అక్కణ్ణుంచి పెద్దగా ఒక చావుకేక వినిపిం చింది. మరుక్షణంలో పొద కదిలినట్టయి, అందులో నుంచి నల్లని ఆకారం ఒకటి బయటికి పారిపోవడం కనిపించింది.

శిఖిముఖి, అజితుణ్ణి హెచ్చరిస్తూ, 'ఈ గుడ్డివెన్నెల్లో వాణ్ణి ఒంటరిగా వెంబడిం చడం ప్రమాదం. శత్రువులు మరి కొందరు ఆ చుట్టుపక్కల ఎక్కడైనా దాగి ఉండొచ్చు. మీ ఇద్దర్లో ఒకరు జాంగ్లాను కనిపెట్టి ఉండండి. మరొకళ్లు మన సామాను రక్షణ చూడండి. నేనూ కేసరీ పోయి ముందుగా, ఆ గాయపడిన చిరుతపులి ఎలా ఉందో చూసి వస్తాం. గాయపడిన క్రూరమృగాన్ని వదిలి ఊరుకోవటం చాలా ప్రమాదం,' అన్నాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ బయలుదేర గానే, అజితుడు, 'శిఖిదొరా! ఇంత జరు గుతున్నా ఎర్రగండు అరవకుండా మొరగ కుండా ఉన్నదేం?' అన్నాడు.

'దానికి ఎవరో ఏమిటి? ఈ జాంగ్లా మత్తుమందు పెట్టాడు. నీ కేక వినపడగానే దాన్ని తట్టి లేపాలని చూశాను. అది మత్తుగా పడి ఉన్నది. అదంతా తరవాత చూద్దాం,' అన్నాడు శిఖిముఖి.

వెలుగుతున్న కట్టె ఒకటి తీసుకుని శిఖిముఖీ, విక్రమకేసరీ పొదలను సమీ పించేంతలో చిరుతపులి ఒకసారి గట్టిగా అరిచి వాళ్ళమీదికి దూకబోయింది. కాని, బాగా గాయపడి ఉండటం వల్లా, గుండెల్లో గుచ్చుకున్న ఈటె ముందుకాళ్లకు అడ్డు పడటం వల్లా, అది పొదలో నుంచి దూకు తూనే పక్కకు పడి గిలగిల్లాడసాగింది.

శిఖిముఖి ఈటెతో దాని తలమీదరెండు సార్లు బలంగా పొడిచి, గుండెల్లో దిగి ఉన్న ఈటెను పట్టుకుని ఒక్క గుంజుతో బయ టకు లాగాడు. చిరుతపులి ఓ క్షణకాలం గిలగిల తన్నుకుని ప్రాణాలు విడిచింది.

'శిఖీ! ఇదీ చూశావా?' అంటూ విక్రమ కేసరి తన ఈటెను చిరుతపులి మెడమీద ఆనించాడు. చిరుతపులి మెడకు ఒకతోలు పట్టెడ బిగించి ఉన్నది.

'ఇది పెంపుడు చిరుత. దీన్ని పెంచిన వాడు స్వయంగా వచ్చి మనం ఉన్న గుడారం మీదికి దీన్ని వదిలి పొదల్లో దాక్కున్నాడు. వాడు నీ బాణం దెబ్బ తిన్నాడు. ఇక వాడి సంగతి చూద్దాం పద,' అంటూ శిఖిముఖి బయలుదేరాడు. ప్రాణ భయంతో గజగజ వణుకుతున్న జాంగ్‌లా దగ్గరకు అతడు రాగానే, జాంగ్‌లా దణ్ణం పెడుతూ అతడి పాదాలమీద పడబో యాడు. శిఖిముఖి, వాణ్ణి మెడ పట్టుకు గుంజి నిలబెట్టి, వాడి చేతిలో ఒక వెలిగే కట్టెపుల్ల పెడుతూ, 'అన్ని సంగతులూ తరవాత మాట్లాడదాం. బాణం దెబ్బతిన్న నీ మిత్రుడు ఎలా ఉన్నాడో చూడాలి. ముందుండి దారితియ్యి. పారిపోవాలని చూశావో, నీ వెన్నులో ఈటె గుచ్చుతాను,' అన్నాడు కఠినంగా.

జాంగ్‌లా మరింతగా వణికిపోతూ పొదల కేసి నడవసాగాడు. వెనగ్గా శిఖి ముఖీ, విక్రమకేసరీ బయలుదేరారు.

(ఇంకా వుంది)





# సమర్థత

మాళవ రాజు జయసింహుడు చాలా పరాక్రమం కలవాడు. అనేక రకాల యుద్ధ విద్యలలో అతడు ఆరితేరినవాడు. అందుకే అతనికి ''రణధీరుడు'' అనే బిరుదు కూడా వచ్చింది.

ఆ రాజ్యంలో ప్రతి ఏటా దసరా ఉత్స వాలు ఘనంగా నిర్వహించేవారు. అయి దేళ్లకొకసారి ఆ ఉత్సవాలలో దేశ, విదేశీ వీరులకు, మేధావులకు అనేక రకాల పోటీలు నిర్వహించి, అందులో గెలుపొం దిన వారిని సముచితంగా సన్మానించేవారు. అంతేకాకుండా తన దేశీయులైన విజేత లను తగిన ఉద్యోగాలలో నియమించే వారు.

ఒకసారి అటువంటి పోటీలలో విజేతల యిన వారిలో నుండి సేనాధిపతిని, సైని కులకు శిక్షణనిచ్చే ఆచార్య పదవిలో మరొకరిని నియమించవలసి వచ్చింది. పోటీలన్నిటినీ ప్రత్యేక శ్రద్ధతో పరిశీలించిన రాజు ఇద్దరు యువకుల శక్తియుక్తులపట్ల సమానంగా ఆకర్షితుడయ్యాడు. అయితే వారిలో ఎవరిని ఏ పదవికి నియమిస్తే సముచితంగా ఉంటుందో నిర్ణయించలేక మంత్రిని సలహా అడిగాడు. అనుభవజ్ఞు డైన మంత్రి ఆ ఇద్దరు యువకులనూ తన కార్యాలయానికి పిలిపించాడు. వారిలో ఒకని పేరు జయచంద్రుడనీ, రెండవ వానిపేరు విశాలుడనీ, ఇద్దరూ వ్యవసాయ కుటుంబానికి చెందినవారనీ తెలుసుకు న్నాడు. పదవులు నియామకాలు గురించి ఏమీ చెప్పకుండా వారితో మంత్రి ఇలా అన్నాడు.

సి.వి.కె.ఎల్. సాయిప్రశాంతి



''మీ ఇద్దరికీ మహారాజు గారు చెరో పదెకరాల పొలం ఇవ్వాలని నిర్ణయించారు. అందులో మీరు వ్యవసాయం చెయ్యండి. ఒక ఏడాది గడిచాక మీరు మరల ఈ పోటీ లలో పాల్గొనాలని రాజుగారు అభిలషిస్తు న్నారు''.

అందుకు జయచంద్రుడూ, విశా లుడూ–ఇద్దరూ అంగీకరించి తమ కృతజ్ఞ తలు తెలిపి మంత్రివద్ద శలవు తీసుకు న్నారు. సాధారణంగా అటువంటి ప్రతిభా వంతులకు రాజుగారి కొలువులో ఉద్యో గాలు లభిస్తాయని తెలిసిన వారందరూ ఈ కొత్త పురస్కారానికి అర్థం ఏమిటా? అని ఆశ్చర్యపోయారు.

జయచంద్రుని భార్య తెలివైనది. ఇదేదో మంత్రిగారు పెట్టిన పరీక్షగా ఆమె ఊహిం చింది. రాబోయే సంవత్సరం వరకూ తన భర్తను వ్యవసాయంపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించి కృషి చేయమని సలహా ఇచ్చింది. అతడు అలాగే చేయసాగాడు. అలాగని యుద్ధ విద్యలలో కృషి కూడా మానకుండా యధాశక్తి చేయసాగాడు.

విశాలుడు మాత్రం తన కిచ్చిన భూమిని ఒక పురస్కారంగా మాత్రమే భావించి, ఆ భూమిలో వ్యవసాయం చేసేందుకు తగిన మనుష్యులను నియమించి తాను మాత్రం యధావిధిగా యుద్ధ విద్యలలో సాధన కొనసాగించాడు.

సంవత్సరం గడిచింది. మంత్రి తాను నియమించిన ప్రత్యేక దూతల ద్వారా వారి రువురికి సంగతులు ఎప్పటికప్పుడు తెలు సుకుంటూనే ఉన్నాడు.

ఈసారి జరిగే దసరా ఉత్సవాలకు జయచంద్రునికీ, విశాలునికీ జరిగిన పోటీలలో విశాలుడు తేలికగా గెలిచాడు.

మంత్రి వారిరువురినీ పిలిచి వ్యవ సాయం గురించి అడిగాడు. జయచం ద్రుడు తన పొలంలో రెండు వందల బస్తాలు ధాన్యం పండిందని చెప్పాడు. వ్యవసాయంలో అనుసరించిన పద్ధతులూ ఎదుర్కొన్న సమస్యలూ వివరించాడు.

విశాలుడు మాత్రం ఆ విషయాలు తానంతగా పట్టించుకోలేదనీ, తను అభ్యా సంలో మాత్రం నిమగ్నుడినయ్యాననీ చెప్పాడు. తన పొలం నుండి యాభై బస్తాల ధాన్యం వచ్చిందని మాత్రం చెప్పాడు.

మంత్రి రాజుగారితో సంప్రదించిన మీదట, జయచంద్రుని సేనాపతిగానూ, విశాలుని సైనిక శిక్షణ పాఠశాలకు అధికారి గానూ నియమించమని సలహా ఇచ్చాడు.

అందుకు అనుగుణంగా ప్రకటన చేసిన రాజు మంత్రితో ''మహామంత్రీ! మీ నిర్ణయంలో అంతరార్థం ఏమిటి?'' అని అడిగాడు.

దానికి మంత్రి 'మహారాజా! ఏదైనా పనిని తలపెట్టినపుడు అందులో స్వయంగా దిగి, లోతుపాతులు తెలుసుకున్నవాడే సమర్థవంతగా ఆ పనిని చేయగలుగు తాడు. అనేక అంశాలను అనుభవపూర్వ కంగా తెలుసుకున్నవాడు పదిమందినీ నియంత్రించగలిగి ఉంటాడు.

ప్రస్తుత సందర్భాన్ని పరిశీలిస్తే, తాను స్వయంగా చేసే అభ్యాసంలో కాస్త వెనక పడినప్పటికీ, జయచంద్రుడు మనం అప్పజెప్పిన కొత్త పనిలో ఎంతో నిష్ణాతు డయ్యాడు. అటువంటి వాడు సేనకు నాయకత్వం వహించి మంచి ఫలితాలు సాధించగలడని భావించాను.

అలాగని విశాలుణ్ణి కూడా తక్కువగా చూడలేము. యుద్ధ విద్యలపట్ల అతనికి ఉన్న ఏకాగ్రత, శ్రద్ధ అతణ్ణి మంచి శిక్ష కునిగా రూపొందించి ఆ రంగంలో మంచి ఫలితాలు సాధించేందుకు ఉపయోగప డగలవు. అందుకే పరిమితమైన లక్ష్యాలు గలిగిన పదవికి అతడు అర్హుడని నా నమ్మకం. అదీగాక మనం ఇచ్చిన పొలం కేవలం బహుమానమే కాదనీ అది ఒక లక్ష్యంతో ఇవ్వబడిందనీ గ్రహించగల తెలివి కూడా సైన్యాన్ని పరిపాలించే వాడికి ఉండవలసిన కనీస అర్హత' అని సమా ధానం ఇచ్చాడు.

ఇంటికి వెళ్ళిన జయచంద్రుడు తన భార్యతో ప్రేమగా ''నాకు వచ్చిన పదవి ఇచ్చింది రాజుగారే అయినా, ఇప్పించిందీ నువ్వే!'' అన్నాడు. ఆమె సంతోషంగా నవ్వింది.





# చక్కని మార్పు

ఆరో తరగతి చదివే ఆనంద్‌కు చదువు కంటే ఆటలంటేనే మక్కువ ఎక్కువ. తల్లి అన్నపూర్ణమ్మ ఎంతగా హితవు చెప్పినప్పటికీ చదువు జోలికే వెళ్లడు. క్రికెట్ వాడికి ఆరోప్రాణం. క్రికెట్ మ్యాచ్ ఎక్కడ జరుగుతున్నా తిండిసైతం మానేసి, బడి ఎగ్గొట్టి, టి.వి.కి అతుక్కుపోతాడు. వాడి మూడు నెలల పరీక్షల ప్రోగ్రెస్ కార్డును చూసి తండ్రి నాగేశం ఎంతో బాధపడి వాడిని కోప్పడ్డా ఆనంద్‌లో మార్పు లేదు. నాగేశం వాడు చదువుతున్న పాఠశాలకు వెళ్లి తరగతి ఉపాధ్యాయుడు గణపతి మాష్టారుతో మాట్లాడాడు.

గణపతి మాస్టర్ 'ఏం బాధపడకండి నాగేశంగారూ! ఇప్పటి పిల్లలు ఇలాగే ఉంటున్నారు. నా శాయశక్తులా వాడిలో మార్పుకోసం ప్రయత్నిస్తాను,' అని చెప్పి పంపాక, తరగతిగదికి వచ్చి, 'పిల్లలూ శ్రద్ధగా వినండి. రానున్న అర్ధ సంవత్సర పరీక్షల్లో పాస్ మార్కులు రాని వారిని వచ్చే సంవత్సరాంతపు పరీక్షలకు కూర్చోనిచ్చేది లేదు. అందువల్ల వారు ఏడో తరగతికి వెళ్లక తిరిగి ఆరోతరగతి లోనే ఉండవలసి వస్తుంది జాగ్రత్త,' అని హెచ్చరించారు.

అది వినగానే పిల్లలందరికీ దడ పుట్టుకువచ్చింది. మిగిలిన వారంతా పై తరగతికి వెళితే తాము ఆ తరగతిలోనే క్రింది వారితో కలిసి ఏడాదంతా చదవాలంటే సిగ్గుగా ఉంటుందనే భయంతో ఆ రోజునుండీ అంతా ఆటల పీరియడ్‌లో కూడా చదువసాగారు. బడితోటలో చెట్ల

ఆదూరి హైమవతి

కింద చేరిన, ఆనంద్ వారితో పాటు కూర్చుని చదువుతున్నప్పటికీ వాడికి ఒక్కటీ తలకెక్కడం లేదు.

మొదటి పాఠాలన్నీ రాకుండా చివరివి అర్థం కాక, పరీక్షల్లో ఎలాగైనా పాస్ మార్కులు తెచ్చుకోవడానికి ఆనంద్ అడ్డదారి వెదకసాగాడు. అర్థ సంవత్సర పరీక్షలకు ముందు జరిగే నెలపరీక్షలు రానేవచ్చాయి.

పరీక్ష గదిలో పేర్ల ప్రకారం ఆనంద్ పక్కన 'ఇందు' పేరు పడింది. దానితో ఆనంద్ పంట పండింది. ఇందుకు సాధారణంగా ఒక పేపర్ రాసి దాన్ని పక్కన పెట్టి మరో పేపర్ రాసే అలవాటు. ఆమె అలా ఒక్కో పత్రమూ రాసి పక్కన పెడుతుంటే, ఆనంద్ దాన్ని మొత్తంగా కాపీ చేయసాగాడు.

అలా అన్ని పరీక్షల్లో కాపీ చేసిన ఆనంద్‌కు అన్ని సబ్జెక్టులలో యాభై పైన మార్కులు వచ్చాయి. తల్లిదండ్రులతో పాటుగా గణేశం మాస్టారు ఆశ్చర్య పడ్డారు.

వాడిలో ఇంతదీక్ష ఉన్నందుకు, తరగతిలో వాడిని అభినందించి, 'చూశారా పిల్లలూ! మీరంతా ఆనంద్‌ను ఉదాహరణగా తీసుకుని చక్కగా చదవాలి మరి. మొన్న మొన్నటి వరకూ చదువంటే పట్టని ఆనంద్ ఈ పరీక్షల్లో మంచి మార్కులు సంపాదించాడు. పట్టుదల



అంటే ఇలా ఉండాలి మరి,' అని పిల్లల చేత చప్పట్లు కొట్టించి మరీ వాడి భుజం తట్టారు.

ఆ రోజు ఆనంద్ తల్లి వాడికి ఇష్టమైన జీడిపప్పు పాయసం చేసి కొసరి మరీ మరీ తినిపించగా, తండ్రి కొత్త చొక్కా కొని తెచ్చాడు. దీనితో ఆనంద్‌కు మంచి మార్కులు వస్తే ఇంతలా పొగడ్తలు, గౌరవం, ప్రేమ దక్కుతాయని తెలిసివచ్చింది. కానీ కష్టపడి చదవడమంటే మాటలు కాదు. అందుకే ఇలాగే అన్నిట్లో కాపీకొట్టేసి మార్కులు సంపాదించాలని అనుకున్నాడు.

అర్ధ సంవత్సర పరీక్షలు రాగానే మునుపటిలా ఇందు పత్రంలో చూసి



ఆనంద్ కాపీ చేయసాగాడు. మాస్టర్ వాడితీరు గమనించి ఆఖరిదైన ఇంగ్లీష్ పరీక్ష రోజు ఇందును వేరే దూరంగా కూర్చోబెట్టారు. ఆరోజు ఆనంద్ కాపీ కొట్టడానికి పక్కన ఇందు లేనందున ఏమీ రాయలేకపోయాడు.

గణేశం మాస్టర్ వాడిని నొప్పించక వాడి తప్పు ఒప్పించి వాడిని సరిచేయాలని భావించి, 'పిల్లలూ! పరీక్షలన్నీ ఐపోయాయి గనుక పదండి అందరం ఆటస్థలంలోకి వెళ్ళి ఆడుకుందాం,' అని అందరినీ బయటకి తీసుకెళ్లారు.

అందరూ వరుసగా నిల్చున్నారు. 'పిల్లలూ! ఆటలోనైనా, చదువులోనైనా దేన్లోనైనా మనం ముందంజ వేయాలంటే ఏకాగ్రతతో సాధన చేయాల్సి ఉంది. ముందుగా మనలోని దురభ్యాసమైన బద్ధకాన్ని తొలగించుకోవాలి. బద్ధకం మనకు ప్రథమ శత్రువు. దాన్ని పక్కకు నెట్టి మన కాలాన్ని సద్వినియోగం చేసుకుంటూ మనలక్ష్యాన్ని చేరే ప్రయత్నం చేయాలి.

క్రికెట్‌కానీ, షూటింగ్‌కానీ, చదరంగం కానీ, ఐఎఎస్ కానీ ఏదైనా సరే లక్ష్య సాధనా మార్గంలో ముందుకు సాగితే విజయం తథ్యం. దానికి ముందుగా మన బుద్ధిని సరైన మార్గంలో పెట్టుకోవడం మనచేతుల్లో పనే...

చూడండ్రా.., బడి తోటలోని పూల మొక్కలు, కూరపాదులూ.. మనం శ్రద్ధగా తలో పీరియడ్ కేటాయించుకుని తోటపని చేయడం వలన చక్కని బడితోటను మనం ఇలా చూస్తున్నాము.

పూలమొక్కలకు పాదులు చేసి, నీరుపెట్టినందున చక్కని అందమైన రంగు రంగుల పూలను ఇస్తున్నాయి. అటువైపున టమోటా, వంగ, బెండ మొక్కలు మంచి ఫలసాయాన్ని అందిస్తున్నాయి. అలాగే ఆ కూరపాదులకేసి చూడండి. బీర కాకర, పొట్ల పాదులు పందిరినిండా కాయలు దిగి ఉన్నాయి.

ఆ పొట్ల పాదు చూడండి, ఆ కాయలకు చిన్నవిగా ఉన్నప్పుడే వాటి చివర తాడుతో చిన్నరాళ్లు కడుతున్నావము.

ఎందుకు చెప్పగలరా?' అని గణపతి మాస్టర్ అడిగారు. పిల్లలు 'తెలీదు మాస్టారూ, ఆకుల్లో కలిసిపోయి కనిపిం చవనా,' అని అడిగారు.

'కాదు కాదు, ఆ పొట్ల కాయలు మనబుద్ధి వంటివి. వాటికి రాళ్లు కట్టక పోతే, అవి వంకరలు తిరిగిపోతాయి. కాయనేరుగా పొడుగ్గా పెరిగేందుకే కాయల చివర రాళ్ళు కడతాం. అపుడు అవి నేరుగా పొడవుగా పెరిగి మంచి ధర పలుకుతాయి.

మన బుద్ధిని కూడా వాటికి రాళ్లు కట్టినట్లుగా, లక్ష్య సాధనవైపు మళ్లిం చాలి. సమయాన్ని వృధా చేయక సరైన రీతిలో మన మనస్సును ఉంచి విజయం సాధించాలి. టెండూల్కర్ గాని, గోపీ చంద్ గాని ఇంతటి విజయాలు సాధిం చడానికి ఎంతటి సాధన చేసి ఉంటారో ఆలోచించండి.

సాధారణంగా మన మనస్సు చెడు వైపు సులువుగా మళ్లుతుంది. దానికి రాయి కట్టి సరైన మార్గంలో ఉంచితే మనమూ ఘనవిజయం సాధించవచ్చు. సరే ఇహ పదండర్రా! ఈ రోజు ఫుట్ బాల్ ఆడదాం.' అని అందర్నీ ఆటవైపు మళ్లిం చారు.

బడిగంట మోగగానే, అంతా తమ సంచులు తీసుకుని ఇంటికి బయల్దే రారు. ఆనంద్ మాత్రం గణపతి మాస్టారు గదిలోకి వెళ్లి ఆయన పాదాలకు నమ స్కరించి, 'మన్నించండి మాస్టారూ! తప్పు చేశాను,' అంటూ పెద్దగా ఏడ్వసా గాడు. మాస్టారు వాడిని లేపి, 'ఆనంద్! నీలో చక్కని మార్పు కోసమే నా తాపత్ర యమంతా, మంచిది, ఇహలే, వెళ్లి నీ మనస్సుకు రాయి కట్టుకుని విజయ మార్గం వైపుగా నేరుగా సాగు,' అని తలనిమిరి పంపారు.



# దగ్గరసాయం!

సదానందపురంలో, శ్రీనాథుడనే జమీందారు ఉండేవాడు. వరదల్లో, పేదవాళ్ళ కొంపాగోడూ పోతే ఆదుకున్నాడు. ఆయన భవంతికి పేదవాళ్లు, తరచూ వచ్చి, ధనమో వస్తురూపేణో ఏదో సాయం పుచ్చుకుని వెళ్లేవాళ్లు.

ఒకసారి, జమీందారు ఎదుట కొందరు, 'సారనాథుడే లేకపోతే కకావికలయి పోయేవాళ్లం బాబూ! తవరిలాగే ఆ బాబు మనసు బంగారం, దేవుడిలా ఆదుకుంటు న్నాడు,' అంటూ, పొగిడారు. సారనాథుడికి ఆ ఊర్లో, నలుగురికీ సాయపడే వ్యక్తిగా మంచిపేరుంది.

శ్రీనాథుడు, ఆగ్రహంతో 'అన్నీ ఇచ్చేది నేను, పొగిడేది ఆ సారనాథుణ్ణా? పొండి.. మిమ్మల్ని ఆదరించడం నాదే తప్పు!' అంటూ కసిరేశాడు.

అంతా గమనించిన దివాను, శ్రీనాథుణ్ణి, మర్నాటి సాయంత్రం పేదవాళ్ల వాడకు తీసుకెళ్లాడు. అక్కడ సారనాథుడు చెమట్లు కక్కుతూ, ఒక పేదవాడి గుడిసె నిర్మాణంలో పాలు పంచుకొంటున్నాడు. అతడి బట్టలు దుమ్ము కొట్టుకునిపోయి ఉన్నాయి. చేతికేదో గాయమైతే కట్టుకూడా ఉంది.

దివాను, 'తమదీ సాయమే, సారనాథుడిదీ సాయమే – సారనాథుడి సాయం వాళ్లకెంత దగ్గరగా ఉందో చూశారా. అందుకే, ఆయనమీద వాళ్లకంత అభిమానం!' అన్నాడు.

శ్రీనాథుడు, సారనాథుడిని మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు. తర్వాత, పేదవాళ్లకు తన సాయాన్ని యధావిధిగా కొనసాగించాడు.

– భీమవరపు పురుషోత్తం



# కెరీర్ అంటే?

గత కొన్ని సంవత్సరాల్లో, భారతదేశంలో లాయర్ల గురించి ప్రజల్లో ఉన్న అభిప్రాయం మారుతూ వస్తోంది.ఇవ్వాళ అనేకమంది యువతీయువకులు అత్యున్నత శ్రేణి న్యాయవాదులుగా మారాలనే ఆకాంక్షను వ్యక్తం చేస్తున్నారు. సమాజంలో మనగలగ డానికి ప్రతీ సంస్థకు న్యాయకోవిదుల అవసరం ఉంది. అందు చేత న్యాయవాద వృత్తి అందరికీ స్వాగతం పలుకుతోంది.



ఈ వృత్తిలో అవకాశాలు:

- న్యాయవాది
- కంపెనీ సెక్రటరీ

చట్టపరంగా తాము ఏం చేయవచ్చు, చేయకూడదు అనే సలహాలు పొందేందుకు ప్రజలు, కంపెనీలు న్యాయవాదులను నియమించుకుంటాయి. కొన్ని సందర్భాల్లో ఇతరులకు, ఇతర కంపెనీలకు లేదా ప్రభుత్వానికి వ్యతిరేకంగా వీరు కోర్టులో తమ పక్షం వాదించే లాయర్లను నియమించుకుంటారు. న్యాయశాస్త్రం కఠినశ్రమ, అంకితభావం, పరిశోధన, ఓర్పు, దీక్షతో కూడిన వృత్తి. కాబట్టి లాయర్‌గా కావాలంటే ఏం చేయాలి?



లాయర్ కావాలంటే మొదట ఏదైనా డిగ్రీ పట్టా సాధించాలి. ఇది ఎల్.ఎల్.బి తో కూడిన నాలుగేళ్ల కోర్స్. న్యాయవాదికి వృత్తిపరమైన రాత నైపుణ్యం, విశ్లేషణా నైపుణ్యం, విమర్శనాత్మక ఆలోచన వంటి లక్షణాలు ఉండాలి. పుస్తకాలలోనూ, ఇతరత్రా కూడా అందు బాటులో ఉండే న్యాయపరమైన వాస్తవాలను న్యాయవాది కనుగొన గాలి. ఈ వాస్తవాలను ఇతరుల ముందుకు తీసుకురావడానికి అతడు/ఆమె చక్కగా మాట్లాడగలగాలి, రాయగలగాలి. న్యాయ శాస్త్రంలో ప్రవేశించడానికి ఏ పట్టభద్రుడైనా సరే లా స్కూల్ అడ్మిషన్ టెస్ట్ (ఎల్ఎస్ఎటి)ని పాస్ కావాలి. సమగ్ర అధ్యయనంతోపాటు, తార్కికమైన హేతుబద్ధత, రాత, విశ్లేషణాత్మక నైపుణ్యం వంటి గుణా లను పరీక్షించడానికి ఇది ప్రామాణిక పరీక్ష. లాయర్ కావడానికి తదు పరి మెట్టు భారత న్యాయమండలి –బిసిఐ– నిర్వహించే పరీక్షలో ఉత్తీర్ణులు కావడం. న్యాయవాద వృత్తిని ఆచరించడానికి లా విద్యార్థి అర్హత సాధించాడా లేదా అనే విషయాన్ని ఈ పరీక్షే నిర్ణయిస్తుంది.



వచ్చే పత్రికలో కెరీర్ ఎంపికలో భాగంగా కంపెనీ సెక్రటరీ గురించి చర్చించుకుందాము.

– సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 35

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -35 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. జనవరి నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. మార్చ్ 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## మహర్షులు



1. కామధేనువు, ఆమె సంతానం నందినిని కలిగి ఉన్న మహర్షి ఎవరు?
2. ద్రోణాచార్యుడికి బ్రహ్మాస్త్రాన్ని ప్రసాదించిన సప్తర్షి ఎవరు?
3. దుర్వాసుడి తండ్రి ఎవరు?
4. అష్టవంకరలతో పుట్టిన రుషి ఎవరు?
5. ప్రాచీన భారతీయ వైద్య పితామహుడిగా గుర్తించబడినది ఎవరు?
6. పూర్వజీవితంలో రాజుగా జీవించి తర్వాత పశ్చాత్తాపంతో బ్రహ్మర్షిగా మారినది ఎవరు?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-32 సమాధానాలు:

1. సెప్టెంబర్ 27 2. పెరూ 3. జమ్మూ, కాశ్మీర్ 4. చార్మినార్ 5. గోవా 6. కేరళ 7. జైపూర్ 8. ముస్సోరి.

*September'11 Winners: 1. Shakshi Satish Naik, AMBAD. M.I.D.C, Near Simbaji's College Nashik.*
*2. Gongati Devika, D/o Chinna polireddy, Mundlamuru(Mandal), Prakasam(dist) - 523265.*
*3. Durai A Navaneetham, C-252 Kandasamy salai, Periyar Nagar, Chennai - 600082.*
*4. Krishnankith Banerjee, Swarg Ashram, Paraniandh Chok Gate, Delhi - 110009.*
*5. Ananya Srivastava, D/o A.C. Srivastava, H.D. 89, Sector - I, Janakipuram, Lucknow-226021.*



# నవ్వుల పువ్వులు



అన్న: నాకు భయంకరంగా తలనొప్పి వచ్చింది.
చెల్లెలు: ఎందుకొచ్చిందో నాకు తెలుసు.
అన్న: ఎందుకు?
చెల్లెలు: ఎందుకంటే, నిన్న నాకు కడుపు నొప్పి వచ్చింది. పొట్ట ఖాళీగా ఉంది కాబట్టే నొప్పి వచ్చిందని అమ్మ చెప్పింది. అంటే నీకు కూడా ఆ సమస్యే ఎదురైనట్లు కదా!



ఉపాధ్యాయురాలు: నీకు నేను రెండు పిల్లలు, నాలుగు కుక్కలు ఇస్తే, నీ దగ్గర ఎన్ని జంతువులు ఉన్నట్లు?
సోను: తొమ్మిది జంతువులుంటాయి టీచర్.
ఉపాధ్యాయురాలు: నీ దగ్గర తొమ్మిది ఎలా ఉంటాయి?
సోను: మన వద్ద ఇప్పటికే తాబేలు, కుందేలు, రామచిలుక ఉన్న విషయం మర్చిపోయారా?



అరుణ్: ఏ రాణికి అతి పెద్ద కిరీటం ఉందో నీకు తెలుసా?
వరుణ్: తెలీకేం.
అరుణ్: అయితే చెప్పు. ఆ రాణి ఎవరు?
వరుణ్: పెద్ద తలకాయ ఉండే రాణికి ఉంటుంది.



తాత: భోజనానికి కూర్చునేముందు ప్రార్థన చేయవా?
వర్షిణి: ఆ అవసరం లేదులే. మా అమ్మ గొప్ప వంటమనిషి!

# మొక్కజొన్న పేలాలు





భూమ్మీద అందరికీ ప్రీతిపాత్రమైన తినుబండారం గురించి ఇక్కడ తెలుసుకుందామా! దాని పేరు పాప్‌కార్న్! చరిత్రలో అతి పురాతనమైన మొక్కజొన్న పేలాలను మెక్సికోలోని బేట్ గుహల్లో కనుగొన్నారు. వీటిని కనీసం 5600 సంవత్సరాల క్రితం కాలానికి చెందినవిగా భావిస్తున్నారు! భారతదేశం, చైనాల్లో కూడా వందలాది సంవత్సరాల క్రితమే పేలాలు ప్రాచుర్యం పొందాయని చరిత్ర చెబుతోంది.



చాలా కాలం క్రితం, మత్స్యకారులు, మొక్కజొన్న విత్తులను ఎండబెడుతున్నప్పుడు వాటిలో వేగిన పేలాలను అటూ ఇటూ వెదజల్లేవారు. ఎండలో వేగిన పేలాలు వడగళ్లులా కనిపిస్తాయని జాలర్లు భావించేవారు. అందుకే వాటిని వరుణుడికి చక్కటి బహుమానాలుగా ఎంచేవారు.



మొక్కజొన్న గింజలతో చేసిన ముంజేతి కంకణాన్ని లేదా మొక్కజొన్న విత్తుల హారాన్ని ఎప్పుడయినా ధరించారా? అజ్‌టెక్ ఇండియన్లు వీటిని గొప్ప సోకు ఇచ్చేవిగా భావించేవారు. వాళ్లు పాప్‌కార్న్‌తో చేసిన శిరోభరణాలు తదితరాలను కూడా ధరించేవారు.



1496లో, క్రిస్టోఫర్ కొలంబస్ వెస్టిండీస్‌కి వచ్చినప్పుడు స్థానిక ప్రజలు అతడి నావికులకు మొక్కజొన్నలను, మొక్కజొన్న పూలగుత్తులను అమ్మడానికి ప్రయత్నించారు.



వాంపనాగ్ ఇండియన్లు మరియు ఇంగ్లీష్ వలసవాదులు 1621లో ప్లేమౌత్ అనే ప్రాంతంలో తమ తొలి శుభాకాంక్షల విందు జరుపుకున్నారు. ఈ విందు సందర్భంగా స్థానిక ప్రజలు జింకచర్మం సంచి నిండుగా మొక్కజొన్న విత్తులను తీసుకువచ్చారని తెలుస్తోంది.



**పాప్‌కార్న్, కష్టకాలాలూ!**

అమెరికాలో మహా మాంద్య కాలంలో ప్రజలంతా కొని తినగలిగిన అతి కొద్ది పదార్థాల్లో జొన్న విత్తులు ఒకటి. ఆ కాలంలో ఇతర వ్యాపారాలు దాదాపుగా దెబ్బతినిపోగా, జొన్నవిత్తుల వ్యాపారం మాత్రం బ్రహ్మాండంగా సాగింది. రెండో ప్రపంచ యుద్ధంలో, సీమాంతరాలలో ఉన్న సైనిక దళాలకు చక్కెర పంపేవారు. దీంతో కలకండ తయారు చేయడానికి తగినంత చక్కెర దేశంలో అందుబాటులో లేకపోయింది. దీంతో అమెరికా ప్రజలు జొన్న విత్తులను మామూలు కంటే మూడురెట్లు ఎక్కువగా తినేశారట.




వివాహ సందర్భాలలో, పెరూవియన్లు జొన్నవిత్తులను గాల్లోకి ఎగుర వేసి వివన్ లాస్ నొవోస్ అని అరిచేవారట. 'కలకాలం వర్ధిల్లు మధుర ఫలహారమా' అని దీనర్థం.



పెర్సీ స్పెన్సర్ మైక్రోవేవ్‌లపై పనిచేసేవాడు. వీటిలో ఏదైనా ఉపయోగకరమైన ఆవిష్కరణ చేయగలనా అని ఇతడు ఆలోచించేవాడు. జొన్నవిత్తులను వేయించడం తను కనుగొన్న గొప్ప ఆవిష్కరణలలో ఒకటి. మైక్రోవేవ్ టెక్నాలజీతో ఇతడు పలు ప్రయోగాలు చేసాడు. ఫలితంగా మైక్రోవేవ్ ఓవెన్ పుట్టుకొచ్చింది.



పాప్‌కార్న్ అద్భుతమైన తినుబండారమే కాదు, క్రిస్టమస్ పర్వదినం అలంకరణలు, శిల్పాలు, తదితర కళాకృతులలో కూడా దీన్ని విస్తృతంగా వాడేవారు. మొక్కజొన్న మాలలు, మంచు తోరణాలు, మెరిసే జొన్న బంతులు –వీటిలోపల బహుమతులు ఉండేవి– వంటివాటిని మొక్కజొన్నలతోనే తయారుచేసేవారు.



పాప్‌కార్న్ తుపాను. అనూహ్యంగా కురిసే వాన, తుపానులను వర్ణించే సందర్భంగా ఈ పదాన్ని వాడుతుంటారు.

మీరు తీరిక లేకుండా ఉంటే మీరిలా చెప్పవచ్చు. 'వంటపాత్రలో వేగుతున్న మొక్కజొన్న అంత బిజీగా ఉన్నాను!'

# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | I am going on a holiday. | When are you going? |
|---|---|---|
| Telugu | నేను సెలవుపై వెళుతున్నాను. | మీరు ఎప్పుడు వెళుతున్నారు? |
| Hindi | मैं छुट्टी पर जा रहा हूँ।<br>మైన్ ఛుట్టి పర్ జా రహా హూ. | तुम कब जा रहे हो?<br>తుమ్ కబ్ జా రహా హో? |
| Tamil | நான் விடுமுறையில் செல்கிறேன்.<br>నాన్ విడుమురైయిల్ సెల్‌గిరేన్. | எப்போது செல்கிறாய்?<br>ఎప్పోదు సెల్‌గిరాయ్? |
| Bengali | আমি ছুটিতে যাচ্ছি।<br>ఆమి ఛుటితె జచ్ఛి. | আপনি কবে যাচ্ছেন?<br>అపని కొబెయ్ జాచ్ఛెన్? |
| Marathi | मी सुट्टीवर जात आहे.<br>మి సుత్తివర్ జాత ఆహె. | तू कधी जात आहेस?<br>తు కది జాత ఆహెస్? |
| Kannada | ನಾನು ರಜೆಯಲ್ಲಿ ಹೋಗುತ್ತಿದ್ದೇನೆ.<br>నాను రజెయల్లి హోగుత్తిద్దేనె. | ನೀವು ಯಾವಾಗ ಹೋಗುತ್ತಿದ್ದೀರಿ?<br>నీవు ఎల్లిగ హోగుత్తిద్దేరి? |
| Oriya | ମୁଁ ଛୁଟିରେ ଯାଉଛି।<br>మున్ ఛుటిరె జాచ్ఛి. | ତୁମେ କେବେ ଯାଉଛ?<br>తుమె కెబె జాచ్ఛా? |
| Gujarati | હું રજા પર જાઉં છું.<br>హున్ రాజా పర్ జావన్ ఛున్. | તમે ક્યારે જઈ રહ્યા છો?<br>తమె క్యారె జాయే రహ్యో ఛో? |
| Assamese | মই বন্ধ কটাবলৈ যাম।<br>మొయి బంధ కొట్టాబొలోయ్ జామ్. | তুমি কেতিয়া যাবা?<br>టుమి కెటియ జాబా? |
| Malayalam | ഞാൻ അവധിക്കാലം ആഘോഷിക്കാൻ പോകുന്നു.<br>న్యాన్ అవధిక్కాలమ్ అఘోషిక్కాన్ పొకున్ను. | എപ്പോൾ പോകുന്നു?<br>ఎప్పోల్ పొకున్ను? |
| Santali | ᱤᱧ ᱪᱩᱴᱤ ᱨᱮᱧᱡ ᱥᱮᱱᱚᱜ ᱠᱟᱱᱟ।<br>ఇఞ్జ్ చుటి రింజి సెనోగ్ కన. | ᱚᱠᱟ ᱛᱮᱢ ᱥᱮᱱᱚᱜ ᱠᱟᱱᱟ?<br>ఒక తెమ్ సెనోగ్ కన? |
| Sanskrit | अहं विरामार्थं गच्छामि।<br>అహమ్ విరామార్థమ్ గచ్ఛామి. | त्वं कदा गच्छसि?<br>త్వమ్ కదా గచ్ఛసి? |





| English | End of this month. | With who are you going? |
|---|---|---|
| Telugu | ఈ నెల చివరలో. | ఎవరితో వెళుతున్నారు? |
| Hindi | इस माह के अंत में।<br>ఇస్ మాహ్ కె అంత్ మె. | तुम किसके साथ जा रहे हो?<br>తుమ్ కిస్‌కె సాత్ జా రహె హో? |
| Tamil | இந்த மாதக் கடைசியில்.<br>ఇంద మాద కడసియిల్. | யாருடன் செல்கிறாய்?<br>యారుదన్ సెల్‌గిరాయ్? |
| Bengali | এই মাসের শেষে।<br>ఈ మాసర్ శేషె. | আপনি কার সঙ্গে যাচ্ছেন?<br>అపని కార్ సొంగేయ్ జాచ్చెన్? |
| Marathi | या महिन्याच्या अखेर<br>హమ్ సాత్ చలేంగె. | तू कोणासोबत जात आहेस?<br>పరసోం? |
| Kannada | ಈ ತಿಂಗಳ ಕೊನೆಯಲ್ಲಿ.<br>ఈ తింగళ కొనెయల్లి. | ನೀವು ಯಾರೊಂದಿಗೆ ಹೋಗುತ್ತಿದ್ದೀರಿ?<br>నీవు యారూందిగె హోగుత్తిద్దేరి? |
| Oriya | ଏଇ ମାସ ଶେଷରେ।<br>ఈ మాష షెషారె. | ତୁମେ କାହା ସହିତ ଯାଉଛ?<br>తుమె కాహా సహిత జాచ్చా? |
| Gujarati | આ મહિનાનાં અંતે.<br>ఆ మహినానన్ అంటె. | તમે કોની સાથે જાઓ છો?<br>తమె కొనే సాథ జావో చ్చొ? |
| Assamese | এই মাহৰ শেষত।<br>ఈ మాహర్ గ్రెఖోట్. | তুমি কাৰ লগত যাবা?<br>తుమి కార్ లొగొత్ జాబా? |
| Malayalam | ഈ മാസം അവസാനം.<br>ఈ మాసమ్ అవసనమ్. | ആരോടൊപ്പം പോകുന്നു?<br>అరొదొప్పమ్? |
| Santali | ᱱᱚᱣᱟ ᱪᱟᱸᱫᱚ ᱢᱩᱪᱟᱹᱫ?<br>నోప చందొ ముచద్? | ᱚᱠᱚᱭ ᱥᱟᱶ ᱮᱢ ᱥᱮᱱᱚᱜ ᱠᱟᱱᱟ?<br>ఒకోయ్ సాన్ ఎమ్ సెనోగ్ కన? |
| Sanskrit | अस्मिन् मासान्ते।<br>అస్మిన్ మాసాన్తే. | केन सह गमिष्यसि त्वम्?<br>కెన్ సహ గమిష్యసి త్వమ్? |

## జీవితమే ప్రయాణం!



ప్రయాణాలు చేయడం అంటే అందరికీ ఇష్టమే. మీకూ ఇష్టమే కదా? అయితే, జీవితకాలమంతా ప్రయాణంగానే ఉంటే ఎలా ఉంటుందో ఊహించి చూడండి. జమ్మూ-కాశ్మీర్‌లో మంచు కప్పిన హిమాలయ శిఖరాలమధ్య గుజ్జార్ తెగవాళ్ళున్నారు. వాళ్ళెప్పుడూ సంచారం చేస్తూనే ఉంటారు. మన దేశంలోని సంచార తెగలలో వీళ్ళు ముఖ్యమైన వాళ్ళు. గుర్రాలమీద దుప్పట్లనూ, తివాసీలనూ, గోనె సంచీలనూ వేసుకుని యేడాదికి కొన్ని వందల కి. మీ. సంచారం చేసే వీళ్ళు గుడారాలు వేసుకుని నివసిస్తారు. గుజ్జార్లు తమ బంధుమిత్రులతో నవంబర్-మార్చ్ నెలలమధ్య జమ్మూలోని రియా, రాజోరి, పూంఛ్ కొండల ప్రాంతంలో సమావేశ మౌతారు. ఏప్రిల్ నెలారంభంలో మళ్ళీ హిమాలయాలలోని ఎత్తయిన మైదానాలకు వలస వెళతారు. సెప్టెంబర్ రాగానే మళ్ళీ అక్కణ్ణించి మూటాముల్లె సర్దుకుని జమ్మూలోని తమ శీతాకాల నివాసాలకు తిరిగి చేరుకుంటారు.

## కాపలా దేవుడు!

తమిళనాడు సముద్రతీరంలో చెన్నయ్‌కి సమీపంలో ఉన్న మీటాన్‌కుళం గ్రామ వాసులకు తాము కొలిచే మునియప్పసామి మీద అపారమైన భక్తి. ఆ దేవుడే తమ ఇళ్ళకు కాపలాకాయగలడన్న నమ్మకంతో దాదాపు 132 గడప లున్న ఆ గ్రామంలో ఒక్క ఇంటికి కూడా తలుపులు అమర్చలేదు.

ఇంతవరకు ఈ గ్రామంలో ఒక్క దొంగతనంకూడా జరగలేదని గ్రామస్థులు చెబుతున్నారు. ఎవరైనా తమ ఇంటికి తలుపు అమర్చుకుంటేనో లేక ఇంటి కొబ్బరాకుల కప్పును తొలగించి దృఢమైన కప్పు వేస్తేనో మునియప్పసామి ఆగ్రహానికి గురికాగలరని కూడా ఆ పల్లె ప్రజలు విశ్వసిస్తున్నారు. రెండువందల యేళ్ళ నాటి మునియప్పసామి గుడికి కూడా తలుపులు లేవు. పైకప్పు కూడా అంతంత మాత్రంగానే ఉంది.



విదూషకుడు

## బీర్బల్



# బీర్బల్ - వంకాయ



1. అక్బర్ చక్రవర్తి బీర్బల్‌తో కలిసి వంకాయ కూర ఆరగిస్తూ, ‘బీర్బల్! వంకాయ కూరగాయల్లో ఉత్తమమైనది కదూ నువ్వేమంటావు?’



2. ‘మీతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను జహాపనా. ఇది చాలా మృదువైన, పోషకాలు కలిగిన కూరగాయ. నిజానికి నేనయితే దాన్ని కూరగాయల రారాజు అంటాను!’ అన్నాడు బీర్బల్.



3. ‘ఎలా?’ చక్రవర్తి బీర్బల్‌ని ప్రశ్నించాడు. ‘దాని తొడిమను చూడండి ప్రభూ, ఇది కిరీటంలా కనిపించడం లేదూ?’ అన్నాడు బీర్బల్. చక్రవర్తి ‘బాగా చెప్పావు బీర్బల్’ అన్నాడు.



4. కొద్ది రోజుల తర్వాత, అక్బర్, బీర్బల్ మళ్ళీ భోజనానికి కూర్చున్నారు. వంకాయ కూరను వారికి వడ్డించగానే అక్బర్ ఆగ్రహంతో గద్దించాడు. ‘ఏమీ, మళ్లీ వంకాయకూరేనా?’



5. ‘బీర్బల్, వంకాయ ఒక చెత్త కూరగాయ. నువ్వేమంటావు?’ అడిగాడు అక్బర్. ‘ముమ్మాటికీ నిజం ప్రభూ. దీంట్లో ఏ రుచీ ఉండదు.’ స్పందించాడు బీర్బల్.



6. అక్బర్ ఆగ్రహంతో, ‘కొన్నాళ్ల క్రితం నువు చేసిన ప్రకటనతో విభేదిస్తున్నావు. పైగా వంకాయ కూరగాయల రారాజు అని కూడా చెప్పావ్.’



7. ‘మీ మాటలకు నేను వంతపలికాను ప్రభూ, మీరు వ్యతిరేకించినప్పుడు నేనూ తోసిపుచ్చానంతే.’ అక్బర్ ప్రశ్నించాడు. ‘అలా ఎందుకు చేసావు?’



8. ‘నేను మీకు విధేయుడిని కాని వంకాయకు కాదు ప్రభూ. దాన్ని పొగిడితే నాకు ఒరిగేదేమిటి? కాని మీ మాటను బలపరిస్తే నాకు మేలు కదా..,’ బీర్బల్ నింపాదిగా చెప్పాడు.



9. బీర్బల్ సరదా మేళవించి చెప్పిన మాటలకు అక్బర్ సంతుష్టి చెందాడు. బీర్బల్ వీపు తట్టి అభినందించాడు. ‘నీకు తప్పక బహుమతి లభిస్తుంది బీర్బల్’ అని చెప్పాడు.

## 300 రోజుల పండుగ

శ్రీరంగంలోని శ్రీ రంగనాథస్వామి ఆలయానికి ఒక విశిష్టత ఉంది. సంవత్సరంలో 300 రోజులపాటు ఏదో ఒక పండుగను ఈ ఆలయ ప్రాంగణంలో నిర్వహిస్తుంటారు. పైగా భారత దేశంలోని దేవాలయాలన్నింటిలోకీ అతి ఎత్తైన గోపురం ఈ ఆలయంలోనే ఉంది. (13 అంతస్తులు కలిగిన ఈ గోపురం ఎత్తు 235 అడుగులు). ఇది దేశంలోని అయిదు ప్రముఖ వైష్ణవ ఆలయాల్లో ఒకటి. తిరుచ్చిరాపల్లికి 15 కిలోమీటర్ల దూరంలో శ్రీరంగం ఉన్నది. ప్రధాన దేవాలయానికి పక్కనే వినాయకుడు, విష్ణువు, దుర్గామాత, రామలక్ష్మణులు, కృష్ణుడు (మర్రిఆకుపై), ఆంజనేయుడు, ధన్వంతరి తదితర దేవతలకు విడివిడి ఆలయాలతో కూడిన ప్రాంగణం ఉంది. ఇక్కడ అనేక పండుగలు జరుగుతుంటాయి. వీటిలో వైకుంఠ ఏకాదశి చాలా ముఖ్యమైన పండుగ. దీన్ని ప్రతి ఏటా డిసెంబర్ నెలలో జరుపుకుంటుంటారు.

# సంగీత వాయిద్యాలు

ఈ నెల సంగీత వాయిద్యాలతో స్క్రాప్ బుక్ రూపొందిద్దాము.



హార్మోనియం



వయొలిన్



తబలా



సన్నాయి



చిడతలు



క్లారినెట్

